# సనాతన స్రవంతి



స్వామి సుందర చైతన్యానంద

స్వామీజీ గీతా యజ్ఞాలలో
యజ్ఞ సమాప్తి సమయంలో
ఏదో ఒక ఆధ్యాత్మిక
వ్యాసమును వ్రాసి, ముద్రించి
భక్తులకు యజ్ఞప్రసాదంగా
పంచడము ఒక ఆనవాయితీగా
నడుస్తూ వుంది.

ఈ యజ్ఞ ప్రసాదాల
సంపుటియే "సనాతన స్రవంతి"
గా వెలువడింది.

చక్కని ప్రాచుర్యమును
పొందిన స్వామీజీ గ్రంథాలలో
సనాతన స్రవంతి కూడా ఒకటి.

గహనమైన అనేక వేదాంత
విషయములను సులభముగా,
సరళముగా ఈ గ్రంథము
వివరించును.
మోక్షగాములకు ఈ గ్రంథము
దారిబత్తెము వంటిది.



# సనాతన ప్రవంతి



జ్ఞానబ్రహ్మ

స్వామి సుందర చైతన్యానంద

## నివేదన



నివసించడం అందరికీ లభ్యం. జీవించడం కొందరికే సాధ్యం. పుట్టిన ప్రతివ్యక్తికి నివసించటం తప్పదు. నివసించే ప్రతివ్యక్తీ జీవించ లేడు. నివసించడానికి యాతన చాలు. జీవించటానికి స్పందన కావాలి.

జీవించేవానికి ఒక లక్ష్యమంటూ వుంటుంది. నివసించే వానికి అంతా నిర్లక్ష్యమే. జీవించడానికి నివసించేవాడు చిరంజీవి. నివసించటానికి జీవించేవాడు మృతజీవి.

జీవించాలనేవాడు ఇతరులకొరకు బ్రతుకుతాడు. అలా బ్రతకడంలో తనను తాను పోగొట్టుకోడానికి కూడా సిద్ధపడతాడు. నివసించే వాడు తనకొరకే బ్రతుకుతాడు. తన మనుగడకోసం ఇతరులను బలి తీసుకోడానికి కూడా వెనుకాడడు.

జీవించే కొరకు నివసించేవాడు మరణించినా అతని జ్యోతి ఆరదు. నివసించేటందుకు జీవించేవాడు బ్రతికినా అతని వెలుగు నిలవదు.

ఊహలు చిగురించని వయస్సులో నేనూ జీవించాలని అమాయకంగా భావించాను. జీవించడానికి ప్రయత్నించాను; ప్రారంభించాను. జీవించడంలో అంత ఒళ్ళు తెలియని మత్తుందని ఆనాడనిపించలేదు. ఆ మత్తులో కనిపించిందీ - వినిపించిందీ ఏదైనా ఉంటే అది పలుకలేనిదై, పాడలేనిదై మిగిలింది. అయినా ఆ మైకంలో అనూహ్యమైన ధైర్యం ఉంటుంది. సాహసించి ఏవో వచ్చిరాని మాటలు పలవరించాను. శ్రుతి లేని సంగీతాన్ని ఆలపించాను. వెర్రి చూపులతో, వెలితి హృదయంతో, వింత పోకడలతో, విడ్డూరపు నడకలతో పలికాను - పలికించాను. పాడాను - పాడించాను. ఆడాను - ఆడించాను. అదంతా ఒక అనుభూతిగా మిగిలి పోయింది. ఏదో అనిర్వచనీయ ప్రశాంతత గుండెలో గూడుకట్టుకుంది. వ్యక్తం కావాలని ఉత్సాహపడి కళ్ళనుండి తొంగి చూసింది. ఎవరెవరో పిలుస్తున్నారు. పిలచిన చోటికల్లా వెళ్ళాను. వేదిక లెక్కించారు. చెప్పమంటే చెప్పాను. పాడమంటే పాడాను.

గీతా యజ్ఞాలు ప్రారంభమయ్యాయి. ప్రతియజ్ఞంలో వేలాదిమంది భక్తులు సావధానంగా శ్రద్ధతో వినేవారు. సంతృప్తిని పొందేవారు. వారి నేత్రాలలో తొణికిసలాడే ఆధ్యాత్మిక ప్రేమానుభూతులు చూసినపుడు నేను జీవిస్తున్నట్టనిపించేది. ఇలా యజ్ఞాలు విస్తృతమయ్యాయి. యజ్ఞ సమాప్తి సమయంలో భక్తులకు యజ్ఞ ప్రసాదంగా ఏదో ఒక ఆధ్యాత్మిక వ్యాసమును వ్రాసి పంచడము జరుగుతూ వచ్చింది. ఆ వ్యాసాలు కూడా ఊహించనంతగా గుర్తించబడ్డాయి. భక్తుల అమృత హృదయాలలో చోటు చేసుకున్నాయి. ఒక్కొక్క యజ్ఞంలో ఒక ప్రత్యేక అంశముపై వ్రాయడం జరిగింది. యజ్ఞ వన వాటికలో ప్రేమజలంతో పెరిగిన జ్ఞాన వృక్షాలలో పుష్పించిన కుసుమాలే ఈ యజ్ఞ ప్రసాదాలు. ఆ యజ్ఞ ప్రసాదాలు కావాలని, పంపమని భక్తులు ఉత్తరాలు వ్రాసేవారు. నా దగ్గర లేకపోవుటచేత నేను పంపలేకపోవడము-భక్తులు నిరాశ చెందడము జరుగుతూ వచ్చింది. అయితే ఇప్పటివరకు ముద్రించిన యజ్ఞ ప్రసాదాలన్నీ కలిపి ఒక పుస్తక రూపంలో వస్తే బాగుంటుందని కొందరు భక్తులు సూచించారు; మిత్రులు ప్రోత్సహించారు. అది మంచి విషయమేగా? ఎందుకు కాదనాలి? అలాగేనన్నాను. దాని ఫలితమే ఈ "సనాతన స్రవంతి".

ఇందులోని ప్రతి వాక్యము జగన్నాథుని వర్ణించడానికి ప్రయత్నించడము వలన ఇది సజీవ స్రవంతి .... శాశ్వత ప్రవాహం కనుక "సనాతన స్రవంతి " అయింది. ఈ స్రవంతి ఈనాటిది కాదు. ఏ వ్యక్తిదీ కాదు. చైతన్యము నుండి చైతన్యమునకు పరుగులిడే అమృత రసవాహిని, విష్ణుదేవుని పవిత్ర పాదాలనుండి కదలిన గంగానది కాశీ, హరిద్వారాలలో పయనించి వాటిని పునీతపరచి అనంతమైన సాగర గర్భంలో లయించు లాగున, వాసుదేవుని చరణ కమలాలనుండి బయలుదేరిన ఈ "సనాతన స్రవంతి " నాలాంటి జడమతిని శుద్ధిచేసి భక్తసముద్రములో లీనమగు చున్నది.

ఈ సందర్భమున మరువలేని, మరపురాని వ్యక్తులు కొందరు నా ముందు నిలుస్తున్నారు. వారే యజ్ఞ కార్యకర్తలు; భక్త మహాశయులు. యజ్ఞ సమయంలో అవిరళ కృషిచేసి ఆ మహా యజ్ఞాలలో సమిధలుగ నిలచిన యజ్ఞ కార్యకర్తలకు, అందు పాల్గొన్న అశేష భక్తజనావళికి నా ప్రేమపూర్వక అభివందనాలు.

1979 వ సంవత్సరంలో ప్రథమంగా ఈ పుస్తకమును ముద్రించడము జరిగింది. పదమూడు వ్యాసాలతో నిండిన ఈ పుస్తకము భక్తుల నెక్కువగా

ఆకర్షించగలిగి మచ్చుకు ఒక కాపీ కూడా మావద్ద లేకుండా పోయింది. మళ్లీ ముద్రించమని భక్తులు ప్రోత్సహించసాగారు. గతం లోని పదమూడు వ్యాసములతో పాటు నూతన వ్యాసములను ఏడింటిని కలిపి 1983 సంవత్సరములో భక్తుల అభీష్టము ననుసరించి ద్వితీయ ముద్రణ, 1985 సంవత్సరములో తృతీయ ముద్రణ, 1989 సంవత్సరములో చతుర్థ ముద్రణ చేయుట జరిగినది.

గ్రంథ వైశిష్ట్యము, భక్తుల విశ్వాసముకలిపి ఈ పంచమ ముద్రణ వెలువడుచున్నది. సత్కర్మ సదా సత్ఫలితాన్నే అందిస్తుంది. స్రవంతి ప్రవాహమే గనుక క్రొత్తనీటివలె క్రొత్తవ్యాసాలూ కలుస్తూనే ఉంటాయి. ఈ పంచమ ముద్రణకూడా నూతనత్వాన్ని సంతరించుకొని విస్తరించడం జరిగిందని మనవి చేస్తున్నాను.

ఈ " సనాతన స్రవంతి "కి కర్త ఎవరు? భోక్త ఎవరు? ప్రదాత ఎవరు? అంతా వాసుదేవుడే....ఏ జన్మ పుణ్యఫలమో, స్వామి ఏనాటి కృపావీక్షణమో పని ముట్టునై మీ ముందు నిలిచాను.

- జైజై రామకృష్ణ హరి -

ఇట్లు
ప్రణవ ప్రేమలతో
భగవత్సేవలో
మీ
స్వామి సుందర చైతన్యానంద

# విషయసూచిక



# సనాతన ప్రవంతి







## ప్రేమ జీవనం

"తుమ్ భయే సరోవర్ మై బనీ మఛియా
తుమ్ భయే చందా మై బనీ చకోరా
తుమ్ భయే తరూవర్ మై బనీ పంఖియా
జో తుమ్ తోడో పియా మైనహీ తోడోరే
తోరీ ప్రీత్ తోడో కృష్ణ కౌన్ సంగ్‌జోడో .... జోతుమ్।

"నీవనే సరస్సులో చేపనై నేను సంచరిస్తాను. నీవనే చంద్రుడికై తపించే చకోరమునై జీవిస్తాను. నీవనే వృక్షముపై నేను పక్షినై మనుగడ సాగిస్తాను. నీకు దూరమై నేను జీవించలేను. నిన్ను వదలి నేను ఎవరి నాశ్రయించేది? మన చిరకాల బంధాన్ని నీవు త్రెంచుకున్నా, కృష్ణా! నేను నిన్ను విడిచిపెట్టను".

ఎడారి ప్రాంతమైన రాజస్థాన్‌లోని చిత్తూరు సంస్థాన అంతఃపుర కుడ్యాలలో ఒకనాడు ప్రతిధ్వనించిన ఈ మధురనామం భక్త మీరా తనసర్వస్వమైన గిరిధర గోపాలునికై తపిస్తూ ఆలపించిన దివ్యగానం.

అజ్ఞాన అహంకారాలతో కరుడుగట్టిన మానవహృదయ ఎడారిలో ప్రత్యక్షమై, అలసిపోయిన మానవజీవితానికి ప్రేమామృతాన్ని అందించి శాంతిని ప్రసాదించుటకై వెలసిన భక్త మీరాబాయి ఒక ఉజ్జ్వల అమృత ఒయాసిస్సు లాంటిది.

మీరా మనసును, హృదయాన్ని సంపూర్ణంగా దోచుకొని ఆమె గానం చేసిన ప్రతికీర్తనలో దోబూచులాడే ఈ గిరిధర గోపాలుడెవరు? అతడొక దివ్య మోహనమూర్తి, ఆశలు లేనివాడు. ఆదర్శమైనవాడు. అనూహ్య ఆధ్యాత్మికావగాహనతో నిండిన అతని జీవితమొక విచిత్రమైనది. తను కదలడు, అందరిని కదలిస్తాడు. మధురమైన అతని నామం భక్తుల హృదయ వీనులలో ప్రతిధ్వనిస్తూనే వుంటుంది. మంజులమైన అతని రూపం భక్తుల కనులముందు మెదుల్తూనే వుంటుంది.

భక్తుల హృదయాలపై చెదరని ముద్రవేసిన ఆ దివ్యాత్ముని త్యాగమయ జీవితం, కదలిక లేని జడాలను సైతం కరగించిన అతని కమనీయ మురళీనాదం, పశువులను సైతం మైమరపించి జోకొట్టిన అతని హస్త స్పర్శ, అసమాన లాలిత్యం వర్ణించడానికి వీలులేక నిలిచి పోయాయి. ఆ మూర్తిలో అగుపించే ప్రతి అలంకరణలో వేదాంత రహస్యాలున్నాయి. ప్రతిచేష్టలో జీవ బ్రహ్మతత్వాన్ని తెలియజేయు చిద్విలాస సమన్వయ సారాంశముంది. జీవితమంతయూ విచిత్రరీతుల్లో నడచి అందరిహృదయాలను ఆకట్టుకొన్న ఆ ప్రేమమూర్తి చిరస్మరణీయుడు. సర్వ సంపూజ్యుడు.

ఏ ఆడంబరాలకు తావులేని, ఏ వేడుకలకు వీలులేని రీతుల్లో కారాగారంలో జన్మించాడు. అవతరించగానే తనకు జన్మనిచ్చిన పుణ్య దంపతులకు దివ్యదర్శనము నొసంగి, సంతోషపరచిన సత్పుత్రుడు. తల్లి ఒడిలో నిద్రించే భాగ్యానికి, తండ్రి ప్రేమలో పెరిగే అదృష్టానికి నోచుకోక పుట్టగానే తల్లిదండ్రులకు దూరమై గోకులంలో జీవించాడు.

ఆటపాటలతో హాయిగా కాలం గడుపవలసిన బాల్యదశలో పూతన, శకటాసురులవంటి రాక్షసులను ఎదుర్కొన వలసిరాగా ధైర్యంతో పోరాడి జయించాడు. కాళీయుని మదమణచి తోటి మానవులకు సంతోషాన్ని ప్రసాదించి, నోరులేని పశువులకు భయభ్రాంతులను దూరంచేశాడు. గోకులంలో పెరుగుతున్న గోవర్ధన గిరిధారి తన మధుర ప్రేమతో తీర్చిదిద్దిన బృందావనం ఒక ఉజ్జ్వల మనోజ్ఞ రసమయ స్వరూపం.



తన పండ్రెండవ సంవత్సరములో శ్రీకృష్ణుడు గోకులాన్ని వీడి మధురకు వచ్చాడు. ఆ చిన్న వయస్సులో ధర్మసంస్థాపనార్థం మేనమామను తన స్వహస్తాలతో వధింపవలసి వచ్చింది. కంసుని వధించి తన తల్లి దండ్రులను చెఱసాలనుండి విడిపించాడు. కంస వధానంతరము హక్కుగా తనకు ప్రాప్తించనున్న రాజ్యాధికారాన్ని తాను ఆపేక్షించక, రాజ్య సుఖాన్ని ఆశించక ఇతరులకు దానంచేసిన త్యాగమూర్తి. తన జీవిత మంతయూ ఏ ఆడంబరము లేక సామాన్య జీవితాన్ని గడిపాడు. ఇతరులకు సాయపడుటే ధ్యేయంగా భావించాడు. భక్త సంరక్షణార్థం తన బ్రతుకులో విశ్రాంతినే మరచిపోయాడు.

కురు పాండవులమధ్య తలెత్తిన భయంకర వివాదాన్ని పరిష్కరించాలని రాయబారం నడిపాడు. తనపై హత్యాప్రయత్నం చేసిన వారిని సైతము ప్రేమించి, వారిపై మందహాసాన్ని చిందించి ఆశ్చర్య చకితుల్ని చేసాడు. ద్వేషించే వారినికూడా ప్రేమించే విశాలహృదయం అతనిది. యుద్ధం అనివార్యం కాగానే ముజ్జగాలను తనలో నింపుకొన్న పరబ్రహ్మ అయిననూ అర్జునుని రథ చోదకుడుగా వెళ్ళడానికి సందేహించని ప్రేమమయుడు. సాయం సమయాలలో యుద్ధం విరమించబడగానే గుర్రాలను స్వయంగా కడిగే నిష్కామ కర్మయోగి. యుద్ధ భూమిలో శోకగ్రస్తుడై కర్తవ్య విముఖుడై విలపిస్తున్న అర్జునునికి తత్త్వబోధచేసి ధర్మమార్గమున నడిపించిన జ్ఞాననైశిత్యంగల బ్రహ్మజ్ఞాని.

తన వారైన యాదవులు ధర్మచ్యుతులై ముసలంపట్టి పరస్పరం బాధించుకుంటూ కూలి ప్రాణాలు విడుస్తుంటే చూస్తూవుండవలసిన దుస్థితి ఏర్పడింది. తన కళ్ళముందే తన వంశమంతా సర్వనాశనమై పోయింది. ఐనా తాను చలించలేదు.

జీవించినంతకాలము అడుగడుగునా అనేక కఠోరబాధలను ఎదుర్కొంటూ లోక కళ్యాణార్థం జీవించిన ఆ పురుషోత్తముడు ఒక అరణ్య ప్రదేశంలో ఏకాంతముగా తనలో తాను విశ్రాంతి తీసుకుంటూ ప్రశాంత నిట్టూర్పును

విడుస్తూ ఉంటే, కదులుచున్న ఆ మహాత్ముని కాలిబొటన వ్రేలిని చూసి మృగ కదలికయని భావించి బాణము నెక్కుపెట్టిన ఒక వేటగాని శరాఘాతమునకు గురియై నవ్వుతూ దేహాన్ని చాలించాడు. కారాగారములో జన్మించినది మొదలు నిర్జనప్రదేశంలో దిక్కులేని విధంగా మరణించి నంతవరకు తన జీవితములో ఎన్నో గండాలు ఎదురైనప్పటికి చలించని ధీరపురుషుడు. తన జీవితములో ఏనాడు కంటతడిపెట్టి ఎరుగడు. బాధ, దిగులు, దుఃఖము లాంటివి తనకు తెలియవు. అతడు పూర్ణపురుషుడు. పరంధాముడు.

అందుకే ఆ పరమాత్ముని, ప్రేమమయుని వదలి జీవించలేని మీరాబాయి....

"రామ మలణ కె కాజ, సఖీ
మేరే ఆరతి ఉర మె జగీరీ ॥రామ॥
తడఫత్, తడఫత్ కల్ న పరతహై
విరహబాణ ఉర్ బగీరీ" ॥రామ॥

"కృష్ణ సందర్శనమున్నకై నా హృదయం తపిస్తున్నది. నా మనను కలవరపడుతున్నది. విశ్రాంతి ఏమిటో నాకు తెలియడంలేదు. విరహ బాణము నా హృదయమును గాయపరచింది" అంటూ విలపిస్తుంది.

శ్రీకృష్ణుని రమణీయ చేష్టలు ఆధ్యాత్మిక భావగర్భితాలు. అర్థం గాని వేదాంత రహస్యాలను తన బాల్యక్రీడలద్వారా ప్రవచించకనే ప్రదర్శించేవాడు. భక్తుల హృదయములందలి నవనీతమనే ప్రేమను దొంగిలించి నవనీత చోరుడయ్యాడు. యథార్థానికి మానసచోరుడయ్యా, వెన్నదొంగ అని పేరుపడ్డాడు. చోరత్వంలో ఎప్పుడూ స్వార్థమే వుంటుంది. కాని కృష్ణుని చోరత్వంలో ఒక ప్రత్యేకత వుంది. జీవకారుణ్యం నిండుకొని ఉంది. తను వెన్న దొంగిలించేవాడేకాని తినేవాడుకాడు. పేదవారైన తనతోటి గోపబాలురకు పంచి పెట్టేవాడు. ఉన్నవారినుండి తీసి లేనివారికి సహాయం చేయాలనే సామ్యవాద సిద్ధాంతానికి ఆనాడే నాందీవచనం పలికిన విధాయక విప్లవవాది శ్రీకృష్ణుడు.



సకల జీవరాసులను తన మురళీగాన మాధుర్యంతో పరవశింపచేసి వేణు గోపాలుడయ్యాడు. మురళి అంటే తనకెంత ప్రేమో వివరించలేము. మురళిని విడిచి క్షణకాలం వుండలేడు. వేణువు తనలోపల ఏమీ లేకుండా ఖాళీగా వుండటమే తన ప్రేమకు కారణమంటాడు. ఎవరైతే "నేను, నాది" అనే అహంకార మమకారాలను విడిచిపెడతారో వారు మురళివలె భగవత్ప్రేమకు పాత్రులు కాగలరని మురళి నాధారంగా తన సందేశాన్ని అందజేస్తాడు.

కనుకనే సర్వం పోగొట్టుకొని కృష్ణప్రేమలో మైమరచిన మీరా

"మేరేతో గిరిధర గోపాల దూసరోన కోయీ
తాతమాత భ్రాత బంధు ఆపనోన కోయీ"

"గిరిధర గోపాలుడు తప్ప నాకీప్రపంచంలో ఎవ్వరూలేరు. తల్లి దండ్రులను, సోదర బంధువులను సైతం నేను వదలి పెట్టాను. ఇక నా కెవరి మీదుంటుంది ప్రేమ? నా జీవితానికి గిరిధర గోపాలుడే శరణ్యం" అంటూ గానం చేస్తుంది.

తాను నీలమేఘశ్యాముడు. నీలివర్ణము అనంతానికి చిహ్నము. నీలివర్ణముతో అగుపించే సాగరము అనంతము. నీలి వర్ణముతో గోచరించే ఆకాశము అనంతము. అలాగే తాను అనంతుడననీ, శాశ్వతుడననీ తన దేహకాంతిద్వారా తెలియజేస్తాడు.

బృందావన పుణ్య భూమిలో తాను సాగించిన రాసక్రీడ భావగర్భితమైన ఆధ్యాత్మ కిరణమయి. రాసక్రీడకు ఆద్యంతాలు లేవు. అది ప్రతి మనిషి జీవితంలో నిరంతరము సాగుతూనేవుంది. రాసక్రీడలో ప్రతి గోపికచెంత ఒక మాధవుడుంటాడు. గోపిక స్త్రీ. సంకల్పమూ స్త్రీ లింగమే. మన మనసులో జనించే సంకల్పాలే గోపికలు. ఇద్దరు గోప భామలమధ్య గోపాలుడు. రెండు సంకల్పాలమధ్య పరమాత్మ స్వరూపం. సంకల్పములను స్వాధీన పరచుకొని ఆత్మ సాక్షాత్కారము పొంద వలయునని రాసలీల ద్వారా బోధిస్తాడు. "నిస్సంకల్పో ముక్తిః" అని శాస్త్రము తెలుపుతున్నది. 16008 మంది భార్యల ప్రసక్తి కూడా అసంఖ్యాకమైన సంకల్ప సమూహము నుదహరించుటయేనని గ్రహించాలి.

బృందావనంలో రాసక్రీడ జరుపునాటికి శ్రీకృష్ణునివయస్సు 8 సంవత్సరాలు. శైశవదశలో తాను చూపిన తాత్త్విక క్రీడా విలాసాలకు వక్రభాష్యం చేయడం మన మనోస్థాయికి ప్రతిబింబం.

సృష్టిలో లైంగిక వికారము లేకనే సంతానమును ఉత్పత్తిచేయు మలినం లేని నిర్మలప్రాణి నెమలి. నెమలి కామజయానికి చిహ్నము. నెమలిపింఛము ధరించి తాను అస్ఖలిత బ్రహ్మచారినని చాటుతాడు.

గోపికల వస్త్రాల నపహరించి అర్థం చేసుకోలేని వారి మనసులలో అపార్థానికి గురయ్యాడు. తాను ప్రబోధించిన భగవద్గీత–2వ అధ్యాయంలో "వాసాంసి జీర్ణాని యథావిహాయ" అను శ్లోకంలో శరీరాన్ని వస్త్రముతో పోలుస్తాడు. గోపికల వస్త్రాలను దొంగిలించి వారిలో వున్న దేహాభిమానమును తొలగించి విముక్తిని ప్రసాదించాడు. దేహాభిమానులకు మోక్షప్రాప్తి దుస్సాధ్యమని పాంచభౌతికమైన శరీరము పైనున్న భ్రాంతిని విస్మరించి భగవంతుని స్మరించమని హెచ్చరిస్తాడు.

అతని అడుగుజాడల్లో పయనించి తరించిన భాగవతోత్తములు ధన్యజీవులు. ఆప్రేమమూర్తి కరుణామృతాన్ని పానంచేసిన ద్రౌపది, ఆ పుణ్యజీవి హృదయంలో స్థిరనివాస మేర్పరుచుకున్న రాధాదేవి, ఆ పావనమూర్తి ప్రేమాలింగనములో సర్వం త్యజించి ఉన్మత్తునివలె సంచరించిన గౌరాంగుడు, ఆ పురాణపురుషుని చల్లటి చూపుల్లో కరిగి పోయిన మీరా చిరంజీవత్వాన్ని సంతరించుకున్నారు.

భగవంతుని ప్రేమదూత వలె ప్రపంచములో అడుగుపెట్టి తమ ఆదర్శనీయ జీవితము ద్వారా నిద్రాణమైయున్న మానవాళిలో చైతన్యమును పునర్జీవింపజేసిన భక్తులు సదా సంస్మరణీయులు. వారి మనుగడే వర్ణనాతీతం. **Long fellow** ఇలా అంటాడు :

> **"God sent his singers upon earth**
> **With Songs of sadness and mirth;**
> **That they might touch the hearts of men,**
> **And bring them back to heaven."**



# సమరము – శాంతి

ప్రపంచమనేది ఒక ప్రయోజనమైన సృష్టి. భేదభావనలతో వ్యర్థ మనస్కులైన జీవులు నివసించే శిథిలగృహం కాదది. పూర్ణత్వం, సౌందర్యం, ఏకత్వము మూర్తీభవించిన పవిత్రాలయం....ఇదొక క్రమ బద్ధమైన విశ్వము; నియమబద్ధ ప్రపంచము.

ఈ ప్రపంచము ఏనాడు మనిషికి సమస్యకాదు. అందులో నివసించే మానవుడే విశ్వానికి సమస్యగా తయారయ్యాడు. భగవంతుడు సృష్టించిన ప్రపంచము ఆదినుండి శుభప్రదమై యున్నది. స్వార్థపూరితుడైన మానవుడు చేయు వికృతసృష్టి ప్రపంచాన్ని భయకంపితం చేస్తున్నది.

ప్రతివ్యక్తి శాంతికాముకుడు. అందుచేతనే అశాంతికి దూరంగా పోవాలనుకుంటాడు. తను దూరంకావాలన్నా చేరువవుతున్న అశాంతిని అంతమొందించాలని ప్రయత్నిస్తుంటాడు.

ఆ ప్రయత్నమే జీవించే ప్రతిప్రాణిని పీడించే ఆవేదన. ఆ పరితాపమే చరించే ప్రతిజీవిలో కనిపించే అభ్యర్థన. ఆ పోరాటమే మారలేని, మార్పురాని బ్రతుకులోని ఆక్రందన. ఆ కల్లోలమే కాలచక్రంలో నలిగే మానవుడు ఆలపించే చరమగీతంలోని ఆందోళన. ఆ సంఘర్షణే గరళం మ్రింగుతున్న గళం, మలిసంధ్యలో అనుభవిస్తున్న యాతన. ఆ సమరమే మానవ జీవనసౌధంలో అలుముకున్న అంధకారాన్ని అదృశ్యం చేయాలన్న తపన. ఇదే ప్రతివ్యక్తిలో, ప్రతి సంఘటనలో, ప్రతికర్మలో ప్రతిబింబించి, ప్రతిధ్వనించే వివాదంలేని నినాదం.

ప్రయత్నాలు జరుగుచున్నవేకాని ఫలితాలు కనుపించటములేదు. తన శ్రమకు సార్థకత లేదు. తన ఆశకు రూపంరాదు. తాను అన్వేషించే శాంతి ఏమిటో? అది ఎక్కడున్నదో తెలియకపోవటమే ఈ అనర్థములకు కారణం.

శాంతి అనేది బయటనుండి కూరేదికాదు. లోపల నుండి వూరేది. మనస్సు నిర్మలంగా, నిశ్చలంగా వుంటే శాంతి స్వాభావికంగా భాసిస్తుంది. అశాంతి కలగటానికి కారణములు అనేకములుండవచ్చు. కాని శాంతిని పొందటానికి కారణము అవసరంలేదు. తన స్వరూపమే శాంతి. ప్రతి ఒక్కరికి అనుక్షణము అనుభవంలో నుండవలసిన శాంతి మానసికాందోళనవల్ల చెదిరిపోతున్నది. చెదరిన మనసు చుక్కాని లేని నావలాగ సుఖదుఃఖాలు, జయాపజయాలు, మానావమానములు, శీతోష్ణములనెడి పరస్పర విరుద్ధ తరంగముల తాకిడికి సంసార సముద్రములో మునిగిపోతున్నది.

శాంతిని భగ్నంచేసే ఈ మనసు రెండు విధములుగా తెలుస్తున్నది. (1) జగత్తు ఆనందాలయమని భావించి, ప్రపంచ ఎడారిలో విషయ సుఖములనెడి ఎండమావులలో శాంతి యనెడి జలము కొరకు పరుగెత్తే మనసొకటి.

(2) జగత్తు దుఃఖాలయమని విశ్వసించి, తనను పీడించి కన్నీటి వర్షం కురిపించేందుకే ఈ ప్రపంచమున్నదని తలచి, భయపడి ప్రపంచానికి దూరంగా వెళ్ళే మనసు మరొకటి.

పైన సూచించిన రెండు మనసులలో ప్రతి మనిషీ ఏదో ఒకటి కలిగి ఉంటాడు. కానీ ఈ రెండు మనస్సులకు శాంతిలేదు. అందుచేతనే ప్రపంచం అశాంతితో అలమటిస్తున్నది.

(3) ప్రపంచము–సుఖముః–మానవుడు ప్రపంచంతో సంబంధాలు ఏర్పరచుకొన్నప్పుడు అనుభవాలు గడిస్తుంటాడు. ప్రపంచం ఉన్నదున్నట్లు కనిపించదు; వినిపించదు; అనిపించదు. అది ద్రష్ట యొక్క మనో భావాలపై ఆధారపడియుంటుంది. కళ్ళజోడు రంగునుబట్టి ప్రపంచం రంగు కనపడినట్లు చూసేవాడిలో సంతోషముంటే ప్రపంచం సుఖాలయంగా దర్శనమిస్తుంది. చూసేవాడిలో దుఃఖం నిండితే ప్రపంచం శోకదేవతలా సాక్షాత్కరిస్తుంది. కనుక ప్రపంచం మానవునికి సుఖాన్నిగాని, దుఃఖాన్ని గాని ఇచ్చేస్థితిలోలేదు. మానవుని బలహీనతే ప్రపంచానికి విలువనిచ్చి జీవంపోసేది.



ప్రపంచానికి హద్దులున్నాయి. మనకు ఎంత యిష్టమైనను ఒకే వస్తువు ఎల్లప్పుడు సుఖాన్నివ్వలేదు. కడుపునిండితే గారెలు చేదు. వస్తువులో సుఖమున్నచో ఆ వస్తువు అందరికి సుఖాన్నివ్వ గలిగి యుండాలి. కొందరికి మాత్రమే సుఖాన్నిచ్చి మరికొందరికి దుఃఖాన్ని కలిగిస్తున్నదంటే వస్తువులో సుఖమూలేదు; దుఃఖమూలేదు. సుఖదుఃఖాలు మనిషి దృష్టిలోనే వుండాలి. ఒకేవ్యక్తి ఒకరికి శత్రువుగాను, మరొకరికి మిత్రుడుగాను నిలిచిపోతాడు. బాల్యంలో ఆనందాన్నిచ్చిన వస్తువులు యౌవనంలో నిస్సారంగా కనిపిస్తాయి. యౌవనాన్ని తేజోవంతం చేసిన వస్తువులు వృద్ధాప్యంలో హాస్యాస్పదంగా గోచరిస్తాయి...కనుక సుఖ మనేది వస్తు ప్రపంచములో లేదు. అది మనిషిలో వుంది. తనలోవున్న సుఖాన్ని గుర్తించలేక ఆ సుఖంకొరకే వస్తుప్రపంచంలో అన్వేషించడం అవివేకం ....దీనినే "విస్మృతకంఠ చామీకరన్యాయ" మంటారు. కనుక ప్రపంచములో సుఖాన్ని వెదకే మనసునకు సుఖములేదు. శాంతిరాదు.

(2) జగత్తు–దుఃఖము – రెండవ మనసు మరీ విచిత్రమైనది. ఈ మనసునకు ప్రపంచం మహాభూతంలా కనిపిస్తుంది. సరియైన జ్ఞానం లేకపోవడమే దీనికి కారణం. త్రాటిలో పామును చూసే జ్ఞానం సరియైనది కాదు. కల్పితమైన ఆ సర్పమునుచూసి భయపడి చిందులు వేయటం అంతకన్నా అవివేకం. త్రాడును తెలుసుకోగానే పాముతో సహా అది కల్పించిన భయముకూడా అదృశ్యమైనట్లు, జగత్తుయొక్క వాస్తవ స్వరూపము తెలియగానే అది కల్పించే భ్రాంతి కూడా దూరమౌతుంది.

కనుక మనసును పుష్టిగా వుంచుకొని, దృష్టిని సవరించుకోవాలి. దుఃఖము ప్రపంచములో సృష్టింపబడలేదు. నీవే ప్రపంచములో దుఃఖాన్ని సృష్టించి చూస్తున్నావు. ప్రపంచములో దుఃఖమనేది లేదని తెలుసుకున్నాం. మనిషికూడా సుఖస్వరూపుడేకాని దుఃఖానికి తనలో స్థానం లేదని ఋజువైంది. మరి దుఃఖము ఎలా వస్తున్నది? అవగాహనలో లోపముండాలి. ఇంద్రజాలమై యుండాలి. సంకల్పముల సంపుటే మనసు గనుక సత్సంకల్పాలతో ఆ మనసును క్రమ పద్ధతిలో నడిపించి, సరియైన అవగాహన ఏర్పరచుకోవాలి.

దుఃఖము మనలో లేదు. దుఃఖము మనలోవుంటే అది మన స్వరూపంలో భాగస్వామి. అలా అయినపుడు దాని భారం మనకు అశాంతి నివ్వదు. ఆవేదన కల్గినపుడు మనం చెదిరిపోనవసరం లేదు.కానీ మన స్వానుభవం అలాలేదు. దుఃఖాన్ని, అశాంతిని, ఆవేదనను మనం క్షణం కూడా భరించలేక పోతున్నాం....కనుక దుఃఖం మన స్వభావంకాదు. అయితే మన స్వభావ మేమిటి? దానికి వ్యతిరేకమై యుండాలి. సుఖమే మన స్వభావం. శాంతియే మన స్వరూపం. ఇది నమ్మించటానికి చేసే తర్కముకాదు, సమర్థించుకోవడానికి చేసే ప్రయత్నముకాదు, ఇది ప్రతి ఒక్కరి అనుభవం. మానవుని అనుభవ పునాదిపై నిర్మించిన సత్యసౌధం...

ఇప్పుడు చెప్పండి. ప్రపంచములో సుఖమున్నదా? దుఃఖమున్నదా? రెండూ వున్నవా? ప్రపంచములో సుఖదుఃఖాలు రెండూలేవు. అవి మానవుని మనసులో కదిలిన కల్లోల పవనాలు. కనుక శాంతికై ప్రపంచాన్ని అనుసరించ నవసరంలేదు. అలాగని దూరంగాను వెళ్ళనవసరం లేదు. దృష్టిమారితే చాలు. జ్ఞానం కలిగితే చాలు. ఎవడయితే రాగద్వేషాలను తటస్థపరచి ఆత్మోన్ముఖుడై ఆనందసాగరంలో తన్మయుడై యున్నాడో వాడే స్థితప్రజ్ఞుడు. వానికి సుఖదుఃఖాలు లేవు. శుభాశుభములు తెలియవు. అనురాగము అర్థంకాదు. భయము రాదు; క్రోధము కనిపించదు. అతడు సముద్రంలా పూర్ణుడై యున్నాడు. నదులు సముద్రములో ప్రవేశించి ఎలా తద్రూపములే అయిపోవుచున్నవో అలాగే సమస్తమైన కోరికలు స్థితప్రజ్ఞునియందు స్వరూప భూతములై అణగిపోవు చున్నవి. అతడే శాంతిసముద్రుడు. అతని శాంతిని పెంచేవారు లేరు. తగ్గించేవారు లేరు. అతని ఉనికే ఒక విచిత్రం. అతడే చినిగిన వస్త్రాలతో షిరిడీలో శోభిస్తాడు. కౌపీనధారియై అరుణాచలంలో అగుపిస్తాడు; కలియుగ అవతార పురుషుడులా కాలడిలో కనిపిస్తాడు; శాంతి ప్రదాతయై దక్షిణేశ్వర వాటికలో దర్శన మిస్తాడు.

ప్రతిఒక్కరూ ఆ స్థాయికే ఒకనాటికి చేరాలి....చేరుతారు. ఆ ప్రశాంతతలో వస్తుప్రపంచము అదృశ్యమై వాసుదేవ స్సర్వమితిఅన్న అనుభూతి కలుగుతుంది. మనసును ప్రకోపించే ఇంద్రియ విషయాలు భగవద్విభూతులుగా మారిపోతాయి.

# బృందావన వీచికలు

## రాధాహృదయం–మురళీ వృత్తాంతం

అజ్ఞానాంధకారంలో అలమటిస్తూ కష్టాల కడలిలో మునిగి పోతున్న మానవ జీవన నౌకకు వెలుగుబాటను చూపి దరికిచేర్చే కాంతి సూచికలే మహాత్ములు. వారు చరించిన పవిత్ర స్థలాలే పుణ్యక్షేత్రాలు.

త్యాగనిరతులై సదా భగవధ్యానంలో తన్మయులై, ముముక్షువులకు జ్ఞానప్రదాతలై ఆచంద్రార్కం ప్రకాశించే పవిత్రాత్ములు మహాత్ములు. వారు తమ జీవిత కాలములో నిలిచిన ప్రదేశములు కూడా పవిత్రములై భావికాలంలో ఆశ్రితులను ఉత్తేజితుల్ని చేస్తాయి. దక్షిణేశ్వరంలో రామకృష్ణుడు చరించిన ప్రదేశము ఈనాటికీ భక్తుల మానసములను శాంతింపచేయుచున్నది. సిద్ధార్థుడు కఠోర తపస్సు చేసిన బుద్ధగయ సాధకులలో అణగియున్న వైరాగ్యమును వెలికి తీయుచున్నది. ఏ రాతి బండపై ఆసీనుడై భావిభారత నిర్మాణాన్ని వివేకానందుడు ఊహించాడో అదే ఈనాడు కన్యాకుమారిలో యాత్రాస్థలమై ఎందరినో సత్యాన్వేషకులుగా మార్చుచున్నది. మహర్షుల నిరంతర తపోధ్యానాలతో పునీతమైన ఋషీకేశము ఎందరో ముముక్షువులకు ధ్యానావేశమును కలిగించుచున్నది. అట్టి పుణ్యక్షేత్రాలలో అనురాగ భరితమై, ప్రేమకు నిలయమై భక్తుల హృదయాలను పరవళ్ళుత్రొక్కించి తన్మయుల్ని చేస్తున్న పవిత్ర పుణ్యధామం బృందావనం. నాటికీ, నేటికి రచయితలకు, గాయకులకు, శిల్పాచార్యులకు, నాట్యధురీణులకు మధుర స్మృతులలో రసమయ స్వరూపమై భాసించుచున్నది.

గోపీ ప్రేమతో బృందావనంలో ప్రతి అణువు నిత్యచైతన్య కాంతి పుంజమై, కమనీయమై హృదయాలను కరిగిస్తున్నది. ఆ పుణ్యస్థలిలో రాళ్ళు మాట్లాడుతాయి. చెట్లు కథలు చెబుతాయి. గాలినుండి సంగీతం వినిపిస్తుంది.

ఎటుచూసినా నందేశాలనందించే ఆ పవిత్ర ప్రేమధామం ఒకనాటి శ్రీకృష్ణపరమాత్మ రాసక్రీడా నిలయం.

బృందావనం మధురస్మృతులలో ప్రేమజీవి, పుణ్యజీవి రాధాదేవిని విడిచి వాసుదేవుని ఊహించే శక్తి ఎవ్వరికీలేదు. ఎవరీ రాధ? కృష్ణుని చైతన్యమే రాధ. రాధ జయదేవుని ప్రాణం; గౌరాంగుని ఆరాధ్య దైవము. ప్రేమ భక్తిలో చరించి, తరించిన భక్తులకు, భాగవతోత్తములకు రాధ మార్గగామి.

రాధ ప్రేమకు భగవంతుడే దాసుడయ్యాడు. రాధకు దూరమై జీవించేశక్తి తనకులేదని భగవంతుడే స్వయంగా అంగీకరించాడు. రాధ ఎవరు? ఏమిటనేది బ్రహ్మవైవర్త పురాణములో శ్రీకృష్ణుడు రాధ నుద్దేశించి పలికిన అమృత వాక్కుల నాలకిస్తే చాలు.

"యథాత్వం తథాహంచ భేదోహి నా వయోర్ధ్రువం
యథా క్షీరేచ ధావల్యం యథాగ్నౌ దాహికాసతి
యథా పృథివ్యాం గంధశ్చ తథాహం త్వయిసంతతమ్"

"రాధా! నీవే నేను. నేనే నీవు. నీకూ నాకూ భేదంలేదు. పాలలో తెల్లదనంలా, అగ్నిలో వేడిలా, పృథివిలో గంధంలా నేను నీలో వుంటున్నాను" అని అంటారు.

ఆశలు తెలియని అమాయకురాలు రాధ. ఊహలులేని మహా మనీషి రాధ. తన మనసు నిరంతర కృష్ణధ్యానంలో మైమరచి తద్రూపమైపోయింది. కృష్ణునిగూర్చి ఒక గోపిక చేసిన నిందారోపణకు రాధ ఇచ్చిన సమాధానమే ఆమె స్థాయికి ప్రతిరూపం.

బృందావనంలో గోపికల మానసములను తన ప్రేమామృతంచే తడిపిన శ్రీకృష్ణుడు బృందావనాన్ని వీడి మథుర కెళ్ళాడు. బృందావనం తిరిగి అతనిలో స్ఫురించలేదు. కృష్ణ వియోగదుఃఖాన్ని భరించలేని ఒక గోపిక రాధవద్దకు వెళ్ళి కృష్ణుని నిందిస్తుంది. తాము ఇంతగా వ్యథ చెందుతున్నప్పటికీ



కృష్ణునిలో కారుణ్యము జనించలేదని పరితపిస్తుంది. ఆ గోపిక మాటలు విన్న రాధ నవ్వుతూ "అర్థరహితమైన నీ ప్రసంగాన్ని ఆపు. భగవంతుని దూషించి నా హృదయాన్ని గాయపరచకు. వాసుదేవుని విమర్శించే నిందావాక్యములు నేను వినలేను. నాతో కృష్ణునిగూర్చి ముచ్చటించ గలిగితే అతని సుగుణాలను కీర్తించండి. అతని క్షేమాన్ని వివరించండి. కృష్ణుడు దగ్గరున్నాడా? దూరంగా వున్నాడా? అనేది నాకు సమస్యకాదు. అతనెప్పుడూ నా హృదయంలోనే వున్నాడు. నాకు ఏవిధమైన బాధలేదు. నాలో దుఃఖాగ్ని పొంగితే నా హృదయనివాసి శ్రీకృష్ణుడు మంటలకు గురియై కుమలిపోతాడు. అందుచేత నేను సదా నవ్వుతూనే వుంటాను. హృదయాన్ని సంతోషంతో, చల్లదనంతో నింపు కుంటాను. నేను బాధ పడితే పరమాత్మ క్షణకాలం కూడా మనలేడని సమాధానమిస్తుంది.

రాధా మాధవుల ప్రేమ ఆదర్శమైనది. దివ్యమైనది. మాలిన్యం లేని ఆ ప్రేమ భక్తుల మనసులను కరిగించింది. వారిప్రేమ కామతృష్ణతో కూడుకొన్నది కాదు. అనూహ్యమైన ఆధ్యాత్మిక రహస్యాలతో నిండినది. బృందావనంలో రాసక్రీడ నాయకుడైన శ్రీకృష్ణుని వయస్సు అప్పటికి ఎనిమిది సంవత్సరాలు. ఇప్పుడు ఆలోచించండి. రాధా మాధవుల ప్రేమ సంబంధం ఎలాంటిదో! అందుచేతనే –

రమే రమేశో వ్రజ సుందరీభిర్య ధార్భకః స్వ ప్రతిబింబ విభ్రమః.

ఎదురుగా అమర్చిన అద్దాలలో కనుపించే తన ప్రతిబింబములను అన్యంగా భావించి ఆడుకొను శిశువులాగే లక్ష్మీపతియైన మహా విష్ణువు వ్రజభూమిలో గోపికలతో క్రీడిస్తున్నాడని భాగవతం చెబుతుంది.

రాధాకృష్ణ రాధాకృష్ణ రాధాకృష్ణ పాహిమాం
రాధాకృష్ణ రాధాకృష్ణ రాధాకృష్ణ రక్షమాం

బృందావనం అన్నపేరు వినగానే రాధతోపాటు మన స్మృతి పథంలో మెదిలే మరొక చైతన్యదీపిక మురళి. భగవానుని అధరామృతాన్ని గ్రోలుతూ

నదా భగవంతునితో కలసి జీవించే ఆ మురళి ఎంతటి పుణ్యజీవి? ఎంత పుణ్యమో – ఈ నందేహమే సత్యభామకు కలిగి స్వామి నిద్రించు సమయాన ప్రక్కగా ఒదిగి కూర్చుని కృష్ణుని మొలలో పరవశిస్తున్న మురళిని అడుగుతుంది. "అమ్మా మురళీ! నీవు చేసిన పుణ్యమేమిటో చెబుతావా? కృష్ణుని అర్థాంగులమైననూ నీ అదృష్టం మాకులేదు. నీ భాగ్యానికి మేము నోచుకోలేదు. నీవు సదా భగవంతునిలో భాగంగా జీవిస్తుంటావు. నిన్ను వదలి స్వామి ఉండటం మేమింతవరకు చూడలేదు" అన్నదట. అందుకు మురళి "అమ్మా! నాలో ఏమున్నదో కాస్త పరిశీలించి చూడండి" అని సమాధానమిస్తుంది. సత్యభామ మురళిని చేతపట్టుకొని పరీక్షించి చూస్తుంది. లోపల ఏముంది? అంతా ఖాళీ."నేను ఖాళీ కావడంవల్లనే భగవంతుడు నన్ను చేపట్టాడు. నేను కోరడం వల్ల కాదు. ఎవరైతే నేను–నాది అనే అహంకార మమకారములను వీడి ఖాళీ అవుతారో వారు భగవంతుని చేతిలో పనిముట్టుగా మారిపోతారు" అని సమాధానమిస్తుంది. ఆహా ఎంత పవిత్రమైన భావన! ఎంతటి మహత్తర సందేశం! అమ్మా! మురళీ! మేమూ నీ స్థాయికి చేరేలా ఆశీర్వదించి అనుగ్రహించు తల్లీ!

–బృందావన విహారిలాల్‌కీ జై –



# మాటలు మూగబోనీ – చేతలు మాటలాడనీ

మనస్సు కలవాడు మనిషి. మహిమకలవాడు మనీషి. మనసులో సంకల్పాలు నడుస్తాయి. మనసులో నడిచే సంకల్పాలు శరీరము ద్వారా కర్మలుగా వ్యక్త మవుతాయి. సంకల్పాలు మాటలాడవు. సంకల్పించేవాడు మాట్లాడుతాడు. మాటలాడేవాని వాక్కులో ప్రతిబింబించేవి అతని సంకల్పాలే. గుఱ్ఱాన్ని తయారుచేయబోగా గాడిద తయారైనట్లు సాధారణంగా మనసులోని సంకల్పాలే మాటల్లో ప్రతిధ్వనిస్తాయని చెప్పలేము. తరచుగా సంకల్పాలు తూర్పుదిక్కున నడుస్తుంటే మాటలు పడమరవైపు నడక సాగిస్తుంటాయి. మాటలకు,సంకల్పాలకు పొత్తే కుదరదు. సూక్ష్మములో నడిచే సంకల్పాలు స్థూలంగా కనుపించే మాటలచేత అణగద్రొక్కబడతాయి. సత్యానికి సంకెళ్ళు పడుతాయి. అసత్యం విలయతాండవం చేస్తుంది. అధర్మం వికటాట్టహాసం చేస్తుంది. ఆంతర్యం కలుషితమవుతుంది. అశాంతి అలుముకుంటుంది. ఏ దేశ చరిత్రలో మనసుకు, మాటకు సంబంధంలేని వ్యక్తులు జీవించారో ఆయాకాలాలలో అస్తవ్యస్త ధోరణులు పెచ్చు పెరిగే వున్నాయి. సంస్కృతి ఛిన్నాభిన్నమయ్యేవుంది.

ఆలోచించేవాడు,ఆలపించేవాడు, ఆచరించేవాడు ఒక్కడే. మూడు చోట్ల కనుపించేవాడు ఒక్కడే అయినప్పుడు తాను యదార్థానికి ఒకే విధంగా కనుపించాలి. కానీ అలా కనుపించటము లేదు. ఆలోచించేవాడు, ఆచరించేవాడు ఒకదారిలో నడుస్తున్నను ఆలపించేవాడు మధ్యలో నిలిచి ఆందోళన కలిగిస్తాడు. మాటలు ఎలా వర్ణించినా మనసులో ఏ భావాలైతే ఉన్నాయో వాటినే ప్రతి వ్యక్తి బహిరంగముగానో, రహస్యంగానో ఆచరించడానికి ప్రయత్నిస్తాడు. తన మనసులో కదిలి, చేష్టలో వ్యక్తీకరించబడే విషయము సర్వజన సమ్మతమైతే

దానిని తెలియచేయటము వలన తన మనుగడకు భంగం వాటిల్లదని గుర్తించినపుడు దానిని బహిరంగ పరుస్తాడు. ముప్పు వాటిల్లుతుందని గ్రహించగానే ఆలోచనకు ఆచరణకు మధ్య వినూత్న పోకడతో, విచిత్ర ధోరణితో ఆలపించేవాడు కనపడి సత్యాన్ని వక్రింపచేసి అసత్యానికి పట్టాభిషేకం చేస్తాడు. అసత్య రాజ్యపాలనలో అగుపించే ప్రగతి అరాచకము, అనుమానము, అమానుషము, అవమానము.

మనసులోని సంకల్పాలను యథాతథంగా మాటల్లో చెప్పలేక పోవటానికి అవి ధర్మవిరుద్ధంగా ఉండటమే కారణము. అధర్మయుతమైన తన సంకల్పాలు వ్యక్తంకాగానే సంఘంలోతన ప్రాబల్యం క్షీణిస్తుందనే భయమే తనలోని వ్యక్తిత్వాన్ని రెండు ముక్కలుగా చేసింది. విభజించింది. వికృత రూపంగా మార్చింది. మనసును మాటలను సమన్వయించలేని వ్యక్తి తన శీలాన్నే ధ్వంసం చేసుకుంటాడు. సమాజాన్ని పెడదారి పట్టిస్తాడు. తనలో ద్వంద్వవైఖరి నలవరచుకుంటాడు. సమాజానికి ప్రశ్నార్థకంగా మిగిలిపోతాడు.

మానవునిలో ఇలాంటి ద్వంద్వ ప్రవర్తన అదృశ్యమై మాటలు, మనసు కలిసి ఏకశ్రుతితో ప్రయాణము సాగించునపుడు తాను సత్య సంధుడు కావటమేగాక తోటివారికి మార్గదర్శకుడవుతాడు. సంఘాన్ని సత్యమార్గంలో నడిపించ గలుగుతాడు. కనుక తాను సంకల్పించే విషయాలే చెప్పగలగాలి. అలా చెప్పలేక పోవడానికి ధర్మవిరుద్ధమైన ఆలోచనలే కారణమని గ్రహించాము. ఏ మాటలు తాను ధైర్యంగా మాట్లాడగలడో అట్టి ధర్మసమ్మతమైన మాటల కనుగుణ్యమైన సంకల్పాలు జరిపిన యెడల తాను సత్యానికి సన్నిహితుడై, ఆలోచనలకు మాటలకు తేడాలేకుండా చూడగలడు. కాని నేటి సభ్యప్రపంచములో మెలిగే మానవునికి సంకల్పాల నాణ్యత కన్నా చిల్లరి మాటలే ఎక్కువ. అసందర్భముగా, అనాలోచితముగా కదలి పొరలివచ్చే మాటలు, వాని వలన కలిగే పర్యవసానాలు మానవజీవన ప్రగతినే చావుదెబ్బ కొడుతున్నాయి. అధిక ప్రసంగి అసత్యవాది కాకతప్పదని ఆర్యోక్తి. అనవసర



విషయాల్ని ప్రస్తావించడం మానాలి. ధర్మజీవన సాగరంలో సత్యవాక్కనే నావనెక్కి మోక్ష తీరాన్ని ప్రతివ్యక్తి చేరాలి.

మాటకు మనసుకు పొత్తుకుదరక పోవటానికి అనవసర అధిక ప్రసంగ మెలాకారణమో అలాగే అంతకన్నా బలీయమైనది, ముఖ్యమైనది మరియొకటుంది. అదియే స్వార్థం.ఇది ప్రతి మానవునిలో గోచరించే భయంకరమైన పైశాచిక వికృతరూపం. మానవత్వాన్ని మట్టిపాలు చేసిన మాయాస్వరూపం. మనిషికి, మనిషికి మధ్య అగాధాలు సృష్టించిన మృత్యుకూపం. "నేను" అనే అహంకార పునాదిపై 'నాది' అనే మమకార సౌధాన్ని నిర్మించి, రాగద్వేషాలనే రమ్యమైన గదుల నేర్పరచి, మోసభాషణలనే రంగులతో తీర్చిదిద్ది, ద్వేషమనే పంకాలు పగలనే భయంకర గాలుల్ని తోలుతూవుంటే, తోటి వ్యక్తి సౌఖ్యమనే దూదితో తయారైన పరుపుపై పవళించి, శ్మశాన సంగీతాన్నాలపిస్తూ కదిలే మాయాచిత్రం ఏదోకాదు. అది స్వార్థమానవుని జీవితం ప్రతిబింబించే నిర్జీవ వికృత శిల్పం.

స్వార్థపరుడైన మానవుని ఆలోచనలెలా నడుస్తాయో ఇతరులకు అర్థంకాదు. అతని మనోవీథులలో కదిలే అపవిత్ర హోరుగాలి ఏ మార్గాన పయనిస్తుందో చెప్పలేము. ఆకాశన్నంటే అతని ఆదర్శ వాక్కులు, పాతాళాన్ని పెకలించి చూడాలనే అతని ఆంతరంగిక భావాలు ఉత్తర దక్షిణ ధృవాలై ప్రకృతి సౌందర్యాన్ని వికృతంగా మార్చడమే గాక, మానవత్వ పరిధిలో దానవత్వ దమనకాండల్ని విజృంభింపచేస్తాయి.

మరి దీనికి తరుణోపాయమే లేదా? ఉన్నది. స్వార్థానికి సంకెళ్ళు వేయాలి. జీవితపు విలువల్ని గుర్తించి గ్రహించినపుడే అది సాధ్యపడుతుంది. మానవుని జీవనకాలం అతిస్వల్పం. పురిటి పొత్తికలతో కదలిన శిశువు – వల్లకాటిలో కాలే శవం– ఈ మిథ్యాజీవనంలో శాశ్వతమనుగడ ఏముంది? పేర్చిన కట్టెలలో ఉంచిన శవం మంటలో కాలి, బూడిదగా మారిన తరువాత నిలిచిం దేముంది? స్వార్థ జీవనం నిలిపిందేముంది? సత్య పంథాలో నడకసాగిస్తే భవిష్యత్తులో ఆదర్శ పురుషుడుగా నిలుస్తాడు. స్వార్థ పూరిత జీవనంలో అసత్య మార్గంలో పయనిస్తే చరిత్రహీనుడుగా అదృశ్యమవుతాడు.

ఇదీ సత్యం. ప్రతివ్యక్తి ఈ సత్యాన్ని జీర్ణించుకొని ఆచరణలో కొనసాగిస్తే స్వార్థం అడుగంటిపోతుంది. త్యాగం పొడసూపుతుంది. జీవనదృక్పథం మలుపు తిరుగుతుంది. ప్రపంచము శాంతినిలయ మవుతుంది. అట్టి ప్రపంచంలో నివసించే పౌరుడు సత్యశీలుడు. తాను సత్యాన్నే ప్రవచిస్తాడు. సత్యాన్నే ఆలోచిస్తాడు. సత్యమార్గంలో నడక సాగిస్తాడు. అతడు నడచిన మార్గమే ఇతరులకు ఆదర్శబాట అవుతుంది.

ప్రతి వ్యక్తి ఈస్థితికి రావాలి. అంతవరకు మాటలెందుకు? త్రికరణ శుద్ధిగా బ్రతుకు నడపలేనపుడు అనర్థ, అప్రస్తుత ప్రసంగా లెందుకు? కనుక మాటలు మూగబోనీ.

శాస్త్రాలు వల్లించినంత మాత్రాన తత్త్వజ్ఞుడు కాలేడు. వేష భాషలవల్ల వ్యక్తి వేదాంతి కాలేడు. అహంకారము నశించని మనిషి ఎన్ని శాస్త్రాలు పఠించినా, తత్త్వాలు వల్లించినా, తీర్థక్షేత్రాలు దర్శించినా, పుణ్యనదులలో స్నానమాచరించినా తనలోని కాలుష్యము కరిగేది వుండదు.

తీర్థయాత్రలు చేయవలెనని కొందరు భక్తులు నిర్ణయించుకొని పరమభక్తుడైన సంత్ తుకారాం వద్దకువచ్చి ఆయనను వారితో రమ్మని ప్రాధేయపడుతారు. ఆర్థికంగా పేదవాడైన తుకారామ్ తాను రాలేననిచెప్పి వారి ప్రేమను తృణీకరించకుండ, ఒక చేదు దోసకాయను వారికియిచ్చి, వారు పుణ్యనదులలో స్నానమాచరించునపుడు, ఆ దోసకాయను కూడా ముంచి తీసుకు రమ్మని ప్రార్థిస్తాడు. యాత్ర వెళ్ళుచున్న భక్తులు ఆ దోసకాయను వెంట తీసుకువెళ్ళి వారు స్నానమాచరించిన పుణ్యనదులలో ఆ కాయను ముంచి తీసుకొనివచ్చి తుకారామ్‌కి ఇస్తారు.

తీర్థయాత్ర ముగించివచ్చిన భక్తులనందరిని తన ఇంటిలో అతిథ్యం స్వీకరించవలయునని తుకారాం ఆహ్వానిస్తారు. అందరూ విచ్చేస్తారు. రుచికరమైన పదార్థాలు వడ్డిస్తారు. వారితో పాటు పుణ్య తీర్థాలలో మునకవేసివచ్చిన దోసకాయను పులుసుచేసి వడ్డించి ఆరగించమని ప్రార్థిస్తారు. ఆ కూర తినగానే చేదుగా వుంటుంది. భక్తులందరూ ఏకకంఠంతో "ఇదేమిటి? ఈ చేదుకూర" అంటారు. తుకారాంజీ భక్తులకు నమస్కరిస్తూ "మహాత్ములారా! క్షమించండి.



ఆ కూర చేదుగావుందా? మీతోపాటు అన్ని పుణ్యతీర్థాలలో స్నానమాచరించినా ఆ చేదు దోసకాయలోని చేదు పోలేదా? నేను మీకు ఇచ్చినపుడు అది చేదుగానే వుంది. కాని తీర్థయాత్రలు చేసివచ్చినా దాని చేదు నశించలేదా" అని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తారు. భక్తులందరూ దానిని గుణపాఠంగా గ్రహిస్తారు. కావలసింది బాహ్య ప్రదర్శనలు కాదు. ఆంతరంగిక పరిణామం. సదాచారం అలవరచుకోవాలి. సర్వాత్మ భావాన్ని పెంపొందించుకోవాలి.

అసత్యపు మాటలు అనర్థాన్ని తెచ్చి పెడుతాయి. అనంత దుఃఖానికి ఆలవాలమై బ్రతుకును అగ్నిగుండానికి ఆహుతి చేస్తాయి. బ్రతుకు బాటను తీర్చిదిద్దలేని మాటలెందుకు? మాటలు మూగబోనీ.

మాటలకన్నా గంభీరంగా, శ్రావ్యంగా మాట్లాడుతుంది మౌనం. ఉరకలేస్తూ పరుగులిడే నదీప్రవాహంలో వినిపించే సంగీత ప్రభావ మేమిటి? సూర్యోదయంతో వికసించే రంగురంగుల పుష్పపంక్తిలో తెలియబడే సాహిత్య సౌరభమెలాంటిది? వినీలాకాశంలోతీర్చిదిద్దినట్లు కనుపించే ఇంద్రధనస్సు సౌందర్యంలో పరవశింపచేసే దృశ్యమేమిటి? ఉవ్వెత్తునలేచే సముద్రకెరటాలు అందించే సందేశమేమిటి?

హృదయాన్ని కరగించి, మనసును మైమరపించే ఈ ప్రకృతి దృశ్యాలు నిస్వార్థ త్యాగమయ కిరణాలు. మానవుని బ్రతుకులోని ఔన్నత్యాన్ని ఎత్తి చూపే ఆదర్శ తోరణాలు. అందుకే అవి మానవుని మాటలకన్నా శక్తివంతమై ఉంటాయి.

మహాపురుషులనబడే వారంతా సంఘాన్ని సంస్కరించారు. మనుషుల్ని మార్చారు. అయితేవారు మార్చింది మాటలతోకాదు, చేష్టలతో, పవిత్రమైన ఆచరణతో. కనుక మనమూ అలాగే జీవిస్తాం. మన ఆదర్శ జీవితము ద్వారా ఇతరులలో జీవనజ్యోతుల్ని వెలిగిస్తాం. అనుష్ఠాన వేదాంతాన్ని మన బ్రతుకుల్లో ఆవిష్కరించుకుందాం.

మరి మాటలు మాట్లాడించిచాలు. ఇక వాటి అవసరం లేదు. మాటలు మూగబోనీ–చేష్టలు మాటలాడనీ.

– తమ సోమా జ్యోతిర్గమయ –

# భగవాన్ దత్తాత్రేయ

పవిత్రతకు, పాతివ్రత్యానికి నిలయమైన ఆర్యభూమి ఆదినుండి ఎందరో సాధ్వీమ తల్లులను ప్రపంచానికి అందించింది. అత్రిమహర్షి అర్ధాంగి అనసూయాదేవి అట్టి వారిలో ఉత్తమశ్రేణికి చెందినవారు.

నారద మహర్షి ఆకలి తీర్చుకొనుటకై ఇనుప గుగ్గిళ్ళను తీసుకు వెళ్ళి వంట చేయమని పార్వతి, లక్ష్మి, సరస్వతులను అభ్యర్థిస్తాడు. అది వారికి సాధ్యపడదని ముగ్గురు అమ్మలు తెలుపగా, భూలోకానికి అరుదెంచి అనసూయాదేవికి తన కోర్కెను నివేదిస్తాడు. ఆమె అందుకు అంగీకరించి తన భర్త పాదాలు కడిగిన చరణామృతమును ఆ ఇనుపగుగ్గిళ్ళపై చల్లుతుంది. తద్వారా పక్వమైన యినుప గుగ్గిళ్ళనుచూసి ఆశ్చర్య చకితుడై, నారదుడు ముగ్గురమ్మలకు తెలియజేస్తాడు. అది విని ఈర్ష్య జనించిన మాతృత్రయము అనసూయను పరీక్షించు ఉద్దేశ్యంతో భర్తలను ప్రార్థిస్తారు. త్రిమూర్తులు సన్యాసుల వేషంలోవచ్చి నిర్వాణభిక్షను కోరుతారు. అనసూయాదేవి తన పాతివ్రత్య ప్రతిభతో భర్త పాదాలు కడిగిన జలాన్ని వారిపై చల్లుతుంది. యతిత్రయము పసిపిల్లలుగా మారుతారు. మరుక్షణమే అప్రయత్నంగా తన స్తనద్వయం నుంచి స్రవిస్తున్న క్షీరాన్ని పిల్లలకు అందిస్తుంది. అత్రిమహర్షి అరుదెంచగానే ఈ జరిగిన వృత్తాంతమంతయు విని జ్ఞాననేత్రముతో సత్యమును గ్రహిస్తారు. త్రిమూర్తులవంటి బిడ్డ కావలెననెడి అనసూయాదేవి కోర్కె ఫలించినందుకు తృప్తి చెందుతారు. అత్రిమహర్షి ఆ ముగ్గురు పిల్లలను కౌగలించుకొనగానే ముగ్గురు అదృశ్యమై వారే రెండు కాళ్ళు, ఒక కంఠము, మూడు శిరస్సులు, ఆరు చేతులుగల ఒక పిల్లవాడుగా మారుతారు. ఆ బాలునికి "దత్తాత్రేయుడు" అని నామకరణం చేస్తారు. ఈ విషయం తెలిసి పార్వతి, లక్ష్మి, సరస్వతి, అత్రిమహర్షి దగ్గరకు అరుదెంచి పతిభిక్ష పెట్టమని అర్థిస్తారు. వారి కోర్కెమేరకు అత్రి మహర్షి త్రిమూర్తులను తిరిగి ప్రసాదించటం జరుగుతుంది.



త్రిమూర్తుల అంశగా ఏర్పడిన దత్తాత్రేయులవారు జ్ఞానశిరోమణిగా ఖ్యాతి గాంచుతారు. వైరాగ్య పరిమళంతో ప్రకాశిస్తూ యుంటారు. సర్వము త్యజించి అవధూతవలె పరిభ్రమిస్తూ దరిచేరువారికి జ్ఞానబోధ చేస్తూయుండేవారు. దత్తాత్రేయులవారు అతి ప్రేమతో సుబ్రహ్మణ్యస్వామికి "అవధూతగీత" బోధించారు. ఇది వేదాంత వాఙ్మయంలో చాలా ప్రశస్తమైన గ్రంథము.

ఒకనాడు దత్తాత్రేయులవారు అరణ్యములో తిరుగుచుండగా యదు మహారాజు దత్తాత్రేయులవారిని చూస్తారు. సర్వము పరిత్యజించి నిత్య హసితవదనుడై బ్రహ్మవర్చస్సుతో శోభిస్తున్న దత్తాత్రేయుల వారిని చూచి "మహాత్మా! తమరింత ఆనందముగా మనుగడను సాగించుటలో రహస్యమేమి? ఈ స్థితిని తమకు ప్రసాదించిన సద్గురువు ఎవరు?" అని ప్రశ్నిస్తారు.

దత్తాత్రేయులవారు చిరునవ్వుతో "నా ఆత్మయే నాకు గురువు. ప్రకృతిలో నా పరిశీలనద్వారా తత్త్వాన్ని గ్రహించాను. నేను సముపార్జించిన జ్ఞానము యిరువది నలుగురు ద్వారా నాకు కలిగింది. ఆ యిర్వై నలుగురే నాకు గురువులు" అని తెలియజేస్తారు. యదు మహారాజుకు కుతూహలం కలుగుతుంది. వారెవరో తెలియజేయవలసిందిగా దత్తాత్రేయులవారిని ప్రార్థిస్తారు. యదుమహారాజు కోర్కెపై తన యిర్వై నలుగురు గురువులను వారిద్వారా గ్రహించిన జ్ఞానాన్ని తెలియ జేస్తారు.

1. తనను గురించి ఎన్ని విధాలుగా హింసిస్తున్ననూ, త్రొక్కుతున్నను, తనపై మలమూత్రములు విసర్జించుచున్ననూ, అన్నిటినీ భరించి ద్వేషభావము లేక హింసించినవారికి ప్రతిఫలంగా పంటలను, ఫలవృక్షములను, లతాపుష్పములను, పూల తేనెలను ప్రసాదిస్తున్న భూదేవినుండి సహనాన్ని, భూతదయను నేర్చుకున్నాను.

2. పరిశుద్ధమైన జలము మురికిని పోగొట్టులాగున అంతఃకరణ శుద్ధి గల మహాత్ములు ప్రాపంచిక మానవుల మనోమాలిన్యాన్ని శుభ్రపరుస్తారు. నేను పరిశుద్ధాంతఃకరణ కలిగి జీవించాలని నీటి ద్వారా పాఠము నేర్చుకున్నాను.

3. గాలి అన్నిచోట్ల తిరిగినను ఎన్నో వస్తువులపై ప్రయాణము సాగించినను దేనితోనూ సంగత్వమేర్పరచుకోని విధంగా ప్రపంచములో ఎవరిమధ్య తిరుగుచున్నను నిస్సంగుడనై జీవించాలని గాలినిచూచి గ్రహించాను.

4. తమ బిడ్డలతో కలసి ఎంతో హాయిగా జీవిస్తున్న పావురముల జంటను ఒకసారి నేను చూచాను. కొంతసేపటికి అక్కడికి బోయవాడువచ్చి వలపన్నాడు. వెంటనే కపోత సంతానము ఆ వల లోనికివెళ్ళి చిక్కుపోయినవి. బిడ్డలను వదలి జీవించలేని తల్లి పావురము విలపిస్తూ పరుగెత్తి తానూ వలలో దొరికిపోయింది. భార్య మీదయున్న అనురాగంతో ఒంటరిగా బ్రతుకలేని మగకపోతము తానూవెళ్ళి వలలో చిక్కుపోయింది. వ్యామోహ మమకారాదులే బంధానికి కారణమని ఆ కపోతములద్వారా గ్రహించాను.

5. తుమ్మెద ఒక పుష్పమునుండిగాక అనేక పుష్పాలనుండి మకరందమును గ్రహించులాగున యతినైన నేను ఒక యింటినుండి గాక కొన్ని యిళ్ళకు భిక్షకు వెళ్ళి గ్రహించినదానితో తృప్తి జెంది జీవించాలని, ఒక యింటిలోనేవుండి గృహస్థులకు భారంకారాదని తుమ్మెదద్వారా గ్రహించాను. దీనినే "మధుకరిభిక్ష" యంటారు.

6 తేనెటీగలు అతికష్టంతో తేనెను సంపాదిస్తాయి. బోయవాడు అతిసులభంగా తేనెను అపహరిస్తాడు. మానవుడు అతికష్టంతో ధనాన్ని సంపాదించి దాచుకుంటాడు. మృత్యువు ఒక క్షణంలో హరించి వేస్తుంది. మనం దాచుకున్నది యముడు దోచుకోవడానికే గనుక ధనమును దాచుట మంచిదికాదని తేనెటీగలను చూచి గ్రహించాను.

7 పాలుత్రాగే శిశువు ఏ వ్యథలు లేక, అలజడులు లేక సదా ఆనందంగా జీవిస్తుంది. సాధకుడు కూడా అహంకార అభిమాన రహితుడై పసిబిడ్డలాగ కాలం గడపాలి శిశువుద్వారా గ్రహించాను.

8 తాను నివసించడానికి పాము పుట్టను నిర్మించుకోదు. చీమలు యిత్యాది కీటకములు తయారుచేసిన పుట్టలో మనుగడను సాగిస్తుంది. సన్యాసి తన



కొరకు ఆశ్రమాలు నిర్మించుకోనవసరం లేదని యితరులు నిర్మించిన గుహలలో, దేవాలయాలలో నివసించడమే ధర్మయుతమని పామునుచూచి తెలుసుకున్నాను.

9 అగ్ని ఎలా ప్రకాశిస్తుందో అలాగే తపోజ్ఞానాలతో యతి ప్రకాశించాలని అగ్ని ద్వారా తెలుసుకున్నాను.

10 సాలెపురుగు తాను నిర్మించుకున్న సాలెగూటిలో తాను చిక్కు గతించిపోతుంది. అలాగే మనిషి తన మనోభావాలనే విషవలయంలో చిక్కు నశించిపోతాడు. కనుక ప్రజ్ఞావంతుడు ప్రాపంచిక విషయ వాసనలనెడి కట్టెలతో పేర్చబడిన జీవన చితిపై మృతి చెందరాదని సాలెపురుగుద్వారా గ్రహించాను.

11 విదేహ నగరంలో పింగల అనే నర్తకి యుండేది. తన నృత్య విన్యాసాన్ని కాంక్షించే పురుషుల ఎదుట నృత్యం చేసి జీవిస్తుండేది. ఒకనాడు తన నృత్య ప్రదర్శనలో పాల్గొని పాలుపంచుకునే వాడుకదారులు ఒక్కరు కూడా రాలేదు. ఆవిడ కొంతసేపు అలాగే నిరీక్షించి నిరాశ చెందింది. ఇక ఎవ్వరూ రారని నిర్ణయించుకున్నది. ఉన్నదానితో తృప్తిపడి గృహంలోనికి వెళ్ళి హాయిగా నిద్రపోయింది. ఆశ వదలిన వ్యక్తికి ఆనందం కలుగుతుందని ఆ నర్తకిని చూసి గ్రహించాను.

12 కొండచిలువ తాను ఆహార సంపాదనకై అలమటించి అలసిపోదు. తాను నిలకడగా ఒక చోటయుంటూ దొరికిన దానితో తృప్తి చెంది జీవిస్తుంది. ఆహారము కొరకు అన్వేషించక "యదృచ్ఛా లాభసంతుష్టః" అయాచితముగా లభించిన దానితో జీవించాలని కొండచిలువనుచూచి నేర్చుకున్నాను. దీనినే "అజాగరవృత్తి" అంటారు.

13 జిహ్వేంద్రియానికి బానిసయైన చేప గాలానికి తగులుకున్న ఎరని మ్రింగాలని ప్రయత్నించి తానే ఆహుతి అయిపోతుంది. రుచి విషయంలో అభిరుచి మంచిదికాదు. దేహరక్షణ నిమిత్తం అవసరమైన ఆహారాన్ని సాధకుడు గ్రహించాలి. ఆహార విషయంలో అత్యాశ అనర్థాన్ని తెచ్చిపెడుతుందని చేపద్వారా గ్రహించాను.

14 గాలి, మేఘము, సూర్య చంద్ర నక్షత్రాదులు సర్వమూ ఆకాశములో వున్ననూ వాటితో ఎలాంటి సంగత్వము ఏర్పరచుకోకుండా నిలిచే ఆకాశమువలె ఆత్మ సర్వత్రా వ్యాపించినను, సర్వమూ ఆత్మయందే ఉన్ననూ ఏ వస్తువుతోను సంబంధము, సంగత్వము లేదనే సత్యాన్ని ఆకాశం ద్వారా గ్రహించాను.

15 చంద్రుడు సదా పూర్ణుడైయున్ననూ భూమి ఛాయ చంద్రునిపై బడు రీతినిబట్టి చంద్రునిలో వృద్ధి క్షయాలు ఉన్నట్టు ఆరోపించులాగున ఆత్మ అనంతము, సంపూర్ణము అయినను శరీర మనోబుద్ధుల ఛాయాప్రసరణచే ఆత్మ పరిమితమనే భ్రాంతి కలుగుచున్నదని చంద్రుని చూసి తెలుసుకున్నాను.

16 ఎన్నో నదులు తనలో కలియుచున్నను తాను ఏ మాత్రము కలత చెందని సాగరమువలె జీవితములో బాధలు, వ్యధలు, దుఃఖము ఎన్ని ప్రవేశించుచున్నను చలించకుండా జీవించాలనే జ్ఞానాన్ని సముద్రుని చూసి గ్రహించాను.

17 దీపకాంతినిచూసి భ్రాంతితో పరుగిడి అగ్నికి ఆహుతై మాడిపోయే చిమ్మట పురుగులాగ, స్త్రీ దేహ సౌందర్యాన్ని చూసి మోహ భ్రాంతిలో మానవుడు ప్రశస్తమైన జీవితాన్ని వృథా చేసుకొనుచున్నాడు. నేత్రేంద్రియమును నిగ్రహించుకొని మనసును మోహమునకు గురికానివ్వక ఆత్మయందు లయంచేసినపుడు నిత్యశాంతి చేకూరగలదని చిమ్మట పురుగును చూసి గ్రహించాను.

18 సూర్యుడు ఒకడే అయినను అనేక నీళ్ళ కుండలలో ప్రతిబింబించి అనేక సూర్యులుగా కన్పట్టులాగున పరబ్రహ్మము శరీరములనే కుండలయందు మనసనే జలములో ప్రతిబింబించగానే అనేక ఆత్మలున్నట్లు తెలియుచున్నది. యదార్థానికి ఆత్మ ఒక్కటే అనే జ్ఞానం సూర్యుని చూసి గ్రహించాను.

19 సంగీతమంటే లేడికి చాలా అభిరుచి. అది తెలిసిన వేటగాడు ఒక పొదలోదాగి శ్రావ్యంగా వాద్య సంగీతాన్ని వినిపిస్తాడు. సంగీతము వినిపించు



దిక్కునకే లేడి అభిలాషతో నడుస్తూ వస్తుంది. దగ్గరకు రాగానే వలపన్ని పట్టుకుంటాడు. శబ్దేంద్రియమునకు లొంగి లేడి ప్రాణము పోగొట్టుకొను విధముగ స్త్రీ యొక్క మృదు మధుర భాషణమనే సంగీతము విని పురుషుడు అన్యాయమై పోతున్నాడు. స్త్రీల విషయంలో శ్రవణము కూడా అపాయమేనని లేడి ద్వారా గ్రహించాను.

20 ఏనుగు ఋతుకాలంలో ఎదుట ఉంచబడిన బొమ్మ ఏనుగును చూసి కామోద్రేకముతో ముందుకు సాగుతుంది. దానిని బంధించడానికి ముందే తయారు చేయబడిన గుంటలో పడి దొరికి పోతుంది. స్త్రీ సంబంధమైన కామవ్యామోహము మనిషికి పతనాన్ని కల్గిస్తుందని ఏనుగు ద్వారా గ్రహించాను.

21 కాకి ఒకచోట మాంసపుముక్కను సంపాదించింది. అది చూసిన ఇతర పక్షులు వెంటనే దానిని వెంబడించాయి. ఎగిరి ఎగిరి కాకి అలసిపోయింది. వెంబడి వస్తున్న పక్షుల బారినుండి తప్పించుకోలేక ఆ మాంసపు ముక్కను వదిలేస్తుంది. పక్షులన్ని కాకిని వదలి ఆ ముక్కను గ్రహించడానికి వెళతాయి. కాకి ప్రశాంతంగా చెట్టు కొమ్మపై కూర్చుని సేద తీర్చుకుంటుంది. ఇంద్రియ విషయాలను పట్టుకున్నంతవరకు జీవికి దారుణమైన దుఃఖమేనని వాటిని త్యజించడము వలన ప్రశాంతత చేకూరుతుందని ఆ కాకిని చూసి నేర్చుకున్నాను.

22 ఒక శ్రామికుడు తన దుకాణం వద్ద శరములను తదేక దృష్టితో పదును చేస్తుంటాడు. అదే సమయానికి రాజుగారు సపరివార సమేతంగా తన దుకాణంముందే వెళ్ళుతారు. ఆ దృశ్యాన్ని శ్రామికుడు చూడలేదు. కొంతసేపటికి ఒక వ్యక్తి వచ్చి "రాజుగారు ఇటు వెళ్ళారా?" అని అడుగుతాడు. "ఏమో నాకు తెలియదు. నేను బాణమును పదునుచేయుటలో నిమగ్నమై ఉండినాను" అని సమాధానమిస్తాడు. ఏకాగ్రత అంటే ఏమిటో అది ఎలాఉండాలో ఆ శ్రామికునిచూసి గ్రహించాను.

23 వివాహ నిమిత్తమై అమ్మాయిని చూడటానికి ఒక ఇంటికి బంధువులు వస్తారు. ఆ సమయంలో అమ్మాయి తల్లిదండ్రులు లేరు. అమ్మాయి ఒక్కతే

ఉంది. వచ్చినవారిని గౌరవించి, తల్లి దండ్రులు వచ్చుసమయమైనదని, కూర్చుండవలసిందని చెప్పి గృహంలోనికి వెళుతుంది. వచ్చిన బంధువులకు అతిథ్యమిచ్చుటకు వడ్లను రోటిలో వేసి దంచుతూ వుంటుంది. అమ్మాయి చేతులకు వున్న గాజులు శబ్దం చేస్తుంటాయి. ఆ గాజుల శబ్దం విని ఇ ఇంటిలో వడ్లుదంచుటకు కూలీలను వినియోగించే శక్తి కూడా లేదని తెలుసుకొ తద్వారా తన ఇంటిపేదరికాన్ని వచ్చిన చుట్టాలు గ్రహిస్తారనే ఉద్దేశ్యముతో తన చేతి గాజులన్నీ పగులగొట్టి ఒక్కొక్క చేతికి రెండేసి గాజుల చొప్పున ఉంచుకుంటుంది. అప్పటికి శబ్దము జనిస్తూనే ఉంటుంది. రెండవ గాజును కూడా పగులగొట్టి చేతికి ఒక గాజుచొప్పున ఉంచుకుంటుంది. ఇక శబ్దములేదు. ఆవిడ తన పనిలో నిమగ్నమవుతుంది. సన్యాసికి జన సంసర్గము మంచిదికాదనియు, ఇద్దరున్నను గొడవలేననియుఏకాంత జీవనమే శ్రేయోదాయక మనియు ఆ అమ్మాయిని చూసి గ్రహించాను.

24 తుమ్మెద కీటకమును తెచ్చి తన గూటిలో ఉంచి పొడుస్తూ వుంటుంది. మళ్ళీ తుమ్మెద ఎప్పుడొస్తుందో, మళ్ళీ తనను భయంకరముగా కాటువేస్తుందేమో అనే భీతితో సదా ఆ కీటకము భ్రమరాన్ని గూర్చే చింతిస్తూ వుంటుంది. అనవరతము భ్రమర ధ్యానంలో ఉన్నందున కీటకము భ్రమరంగా మారిపోతుంది. "యద్భావం తద్భవతి" భావాలే బ్రతుకును నిర్ణయిస్తాయి. నిరంతరం ఆత్మధ్యానంలో నేనూ ఆత్మజ్ఞానినై పోవాలని దేహ భ్రాంతిని వదలి మోక్షసామ్రాజ్యాన్ని సాధించాలని ఈ భ్రమర కీటకములను చూసి నేర్చుకున్నాను. దీనినే "భ్రమర కీటక న్యాయ"మంటారు.

దత్తాత్రేయులవారి ద్వారా పై సత్యాలను గ్రహించిన యదు మహారాజు సంతృప్తిని చెందినవాడై సంసారాన్ని త్యజించి తదేకముగా భగవధ్యానంలో శేషజీవితాన్ని చరితార్థం చేసుకున్నాడు.

దత్తాత్రేయులవారు తనకు లభ్యమయ్యే ప్రతిచోటనుండి జ్ఞానాన్ని సముపార్జించారు. సాధకులెప్పుడు ఎవరినుండి జ్ఞానప్రసరణ జరుగుచున్నను గ్రహించడం అలవరచుకోవాలి.

ఓం .... తత్ సత్

# ఉన్నదంతా నీవే

భగవంతుడు మనిషిని సృష్టించాడు. మానవునికి రూపమిచ్చాడు. మానవుడు కృతజ్ఞతాభావంతో ప్రతి చర్యగా భగవంతుని సృష్టించాడు. దేవునికి ఆకృతిని కల్పించాడు. శృతి విన్నాడు. ఫలశ్రుతి ఏమిటి? ఇరువురూ నామరూపాలకు శంకుస్థాపన చేసిన వారయ్యారు. యధార్థానికి ఇద్దరూ సృష్టి చేయలేదు; ఇద్దరూ సృష్టింపబడనూలేదు.

నత్వేవాహం జాతునాసం నత్వంనేమే జనాధిపాః
నచైవ నభవిష్యామ స్సర్వే వయమతః పరమ్.

"అర్జునా! నేను, నీవు, ఈ రాజులు గతంలో లేనివారము కాము.భవిష్యత్తులో నశించేవారము కాము" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో ప్రబోధించారు. గతంలో లేనివారము కాము అని ఈ శరీరము జనించకపూర్వము మన మనుగడను గూర్చి ప్రస్తావించారు. ఈ శరీరము పుట్టకపూర్వం మనమున్నామనే కదా? కనుక ఈ శరీరము నశించినా మనముంటామని భావము. అయితే చావుపుట్టుక లెవరికి? నాకు కాదు. ఎందుకంటే పుట్టింది శరీరము. శరీరము పుట్టక పూర్వము నేనున్నాను. కనుక నేను ఎప్పుడూ ఉండేవాడిని. ఎప్పుడూ ఉండేదే సత్యము. సత్యము కాలాతీతమైంది. కనుక గతంలో వుండినాను. వర్తమానంలో ఉన్నాను. భవిష్యత్తులో వుంటాను. ఎప్పుడూ వుండేటప్పుడు ఇక బంధమెవరికి వచ్చింది? ముక్తి ఎవరికి కావాలి? యధార్థానికి బంధ మోక్షాలు మాయాజనితాలు. బంధము రాలేదు కనుక క్రొత్తగా ముక్తి వచ్చే ప్రసక్తేలేదు. అయితే బోధ ఎందుకు? ఎవరికి? భిన్నత్వాన్ని దర్శించేవానికే బోధ. ద్వైతచింతనతో నలిగేవానికే ప్రబోధము.

ప్రబోధము దేనిని గురించి? ఆత్మను గురించి. ఆత్మ బయట వస్తువైనపుడు దానిని గూర్చి తెలియజేయాలి. తెలుసుకొనేవాని అస్థిత్వమే ఆత్మ అయినపుడు ఇక ప్రత్యేకించి దేనిని తెలుసుకోవాలి? మనకన్నా అన్యమైనవానిని తెలుసుకుంటున్నాము. మనమే ఆత్మ అయినప్పుడు ఇక తెలుసుకొనేది దేనిని? ఆత్మకన్నా అన్యమైనదానినే కదా! బాగా ఆలోచించండి. ఆనందాన్ని అందుకోవాలని అజ్ఞానాన్ని ఆలింగనం చేసుకుంటున్నాం.

అయితే అన్య వస్తువుల్ని వదలి ఆత్మను నేను తెలుసుకోవాలన్న మాట. నేను ఆత్మను తెలుసుకోవడమంటే నేను ఆత్మకన్నా అన్యమని భావము. యథార్థానికి ఆత్మయే నేను. కనుక ఆత్మకొరకు అన్వేషించే ఆస్కారము లేదు. ఆత్మ సాక్షాత్కారమేమిటి? ఆత్మ ఎప్పుడూ ప్రత్యక్ష సాక్షియై ఉన్నది. అలాంటప్పుడు నేను ఆత్మయనెడి ఎరుక నాకెందుకని కలగటంలేదు అనే సందేహం కలుగుతుంది. దానికి కారణం దేహాత్మభావంకలిగి యుండుటయే. శరీరముతో తాదాత్మ్యంచెంది దేహాత్మ వాదులుగా వర్తిస్తున్నాం. వాస్తవానికి మనం ఆత్మకన్నా ఎప్పుడూ భిన్నంగా లేము. దేహముతో తాదాత్మ్యం చెందియున్నప్పుడు కూడా మనం ఆత్మయే అయివున్నాము. కర్ణుడు సూతపుత్రుడుగా జీవించునపుడు కూడా అతడు కుంతీకుమారుడే. తన జన్మసత్యాన్ని ఎవరూ నిరాకరించ లేరు. తాను కుంతీకుమారుడై వుండికూడా ఆ సత్యాన్ని గ్రహించలేక పోయాడు. అంటే సత్యానికి సంబంధించిన జ్ఞానము లేదని భావము. కనుక ఇప్పుడు కావలసింది జ్ఞానము. ఉన్న దానిని తెలుసుకొనే జ్ఞానము. అంతేగాని లేని దానిని సృష్టించి తెలుసుకొనే కల్పిత జ్ఞానము కాదు. కర్ణుడు తాను కుంతీకుమారుడనని తెలుసుకుంటే చాలు. అంతేగాని ఆమె గర్భంనుండి మళ్ళీ జనించ నవసరము లేదు. కనుక నీవు ఆత్మయే అయివున్నావు. అది గ్రహించు చాలు. ఉన్నది నీవేనని తెలుసుకో.

ఉన్నది నేనే అయినపుడు మరి ఈ ప్రపంచము? ప్రపంచము ఎక్కడనుండి వచ్చింది? ఎక్కడున్నది? ప్రపంచం నీలో ఉన్నదా? నీవు



ప్రపంచంలో వున్నావా? ప్రపంచాన్ని తెలుసుకుంటున్నందున ప్రపంచం గోచరమవుతున్నది. ఈ ప్రపంచాన్ని దర్శిస్తున్నదెవరు? మనసు. అది విషయం. వస్తువు అద్దములో ప్రతిబింబించినట్లు ప్రపంచము మనసులో భాసించుచున్నది. అద్దము పగిలిపోగానే ప్రతిబింబము అదృశ్యమగు చున్నది. మనసు నశించగానే ప్రపంచము ఉపశమించు చున్నది.

అద్దములో ప్రతిబింబము కనుపించుటకు కారణమైన వస్తువు ఉండాలికదా! కనుక మనసులో దృశ్య ప్రపంచము ప్రతిబింబించేటట్లయితే అంతకుపూర్వం విశ్వమున్నట్లేకదా! ఉండబట్టేకదా ప్రతిబింబించినది.

ఈ సమస్య స్వప్న దృష్టాంతముద్వారా పరిష్కరించ బడింది. స్వప్నములు ఎక్కడనుండి కలుగుతున్నాయి? మనసునుండే కలుగుతున్నాయి. స్వప్నాలకు బయట ప్రపంచముతో సంబంధము లేదు. స్వప్నము జరుగుచున్నంతవరకు యథార్థముగానే గోచరిస్తున్నది. గాఢ నిద్రలో స్వప్న ప్రపంచము లేదు. ఎందుకని? స్వప్నాన్ని తయారు చేసే మనసు లేదు గనుక. మనసు మాయా జనితము. తయారుచేయబడిన స్వప్నము మనోకల్పితము. కనుక స్వప్నంలో జరుగుచున్న దేమిటి? ద్రష్ట ఎవరు? దృశ్యమేమిటి? మనసే మనసును చూస్తున్నది. సినిమాలో పోలీసు దొంగ నన్వేషిస్తున్నాడు. అన్వేషించే పోలీసు, అన్వేషింపబడే దొంగ ఇద్దరూ యథార్థానికి లేనివారే. అక్కడ ఉన్నది బొమ్మలే కాని వాస్తవాలు కావు. ఈ దృశ్యమాన ప్రపంచ మనుగడే మాయాకల్పితము. "మాయాకల్పిత దేశ కాల కలనా వైచిత్ర్య చిత్రీకృతమ్" అని ఆదిశంకరులు దక్షిణామూర్తి స్తోత్రములో వివరించారు.

కనుక మాయలో నిలిచి మాయను ప్రశ్నించలేము. స్వప్నంలో నిలిచి స్వప్నాన్ని ప్రశ్నించలేము. జాగ్రదవస్థకు వచ్చినపుడే స్వప్నము అబద్ధమని తేలుతుంది. మనోస్థాయిలో వున్నంతవరకు మనోజనిత వికారాలు, అవి కల్పించే అనంతభావాలకు బానిసలై వుంటాము. మనసును దాటాలి. మనసును దాటగానే సత్యం ఎరుక పడుతుంది. ఏమిటా సత్యం? తాను అన్వేషించింది

తననేనని, తాను ఆశించిన ఆనందం తనకన్నా వేరు కాదని దీనిని గ్రహించడమే సత్యం. ఇదే సత్య దర్శనము.

మరి ఇక అన్వేషణ ఎందుకు? అన్వేషించే నీవు, అన్వేషింపబడే వస్తువు రెండూ ఒకటేనని గ్రహిస్తే చాలు. అప్పుడు ఉన్నదందా నీవే.

ఇక బాధెందుకు? బాధలు నిన్ను బాధించకుండా సాగిపోనీ. బాధించే బాధల్ని బాధించకుండా వదలిపెడితే బాధలు నిన్ను బాధ పెట్టవు. బాధలలోని బాధల్ని బాధలుగా భావించక బాధలను బాధలుగా కొనసాగనీ. బాధలు బాధించే బాధలు నిన్ను చేరవు. బాధలు బాధల్ని బాధించుకుంటాయి. నీవు నీవుగా ఉంటావు.

---- తత్త్వమసి ---






సర్వేశ్వరుని దివ్యసంకల్పముచే ఆవిర్భవించిన ఈ కళాత్మక ప్రకృతి కమనీయ, రమణీయ, మనోహర సుందర దృశ్యములకు నిలయమైన పుణ్యస్థలి. పురివిప్పి ఆడే నెమలి విన్యాసం, వెన్నెలను చిందించి వికాసాన్నందించే చంద్రుని మందహాసం–పరుగిడే నదీమతల్లి సంబరం– హృదయాన్ని ద్రవింపచేసే కళామతల్లి కథనం – మానవుని మనస్సుపై చెదరని ముద్రలు వేయకమానవు. అవన్నీ ఫలితాలాశించని మహోత్తమ కార్యాలు. వాటి సాన్నిధ్యంలో మనసు కరుగుతుంది. కలలు చెదిరిపోతాయి. చీకటి తెరలు చీల్చుకుంటాయి. వెలుగు కిరణాలు జారుతాయి.

వీటన్నిటిని గ్రహించటానికి మానసిక ప్రశాంతత కావాలి. మనస్సు ఋజుమార్గంలో పయనించాలి. ప్రసన్నతను పొందాలి. ఒక వస్తువుపై అభిరుచి లేనప్పుడు ఆ వస్తువునుండి పొందే ఆనందమేమీ వుండదు. కోరికలు కరిగిపోతే వస్తువులు అలా నిర్వీర్యమై నిలబడి పోతాయి. వస్తుప్రపంచము ప్రతిక్షణమూ మారుతూ వుంటుంది. మారుతున్న వస్తుసంతతిని గ్రహించాలంటే, ఆ తెలుసుకొనే పరికరము మారనిదై యుండాలి. దాని ఉనికిని పట్టుకోవడం మన ఆదర్శం కావాలి. అట్టి ఆదర్శము ఫలించి, అనుభవంగా మారగలిగితే జీవునికి శాశ్వత శాంతి లభిస్తుంది. వస్తువులు, విషయాలు, వ్యక్తులు తారుమారైననూ శాంతికి కొరతరాదు. ఇట్టి అపూర్వ శాంతిని జీవితంలో అంతరంగిక దృష్టితో వెదకి సాధించాలి. నిస్వార్థపరులు, త్యాగమూర్తులు, ఆప్తకాములైన మహర్షులు అంతర్దృష్టిని పొంది తరించే మార్గాన్ని తమ కావ్యక్షేత్రాల్లో భద్రపరచారు. వారివి రచనలు కావు; మానవ జీవన దృక్పథాన్ని తీర్చిదిద్దే దివ్య మణిదీపికలు. అవి కావ్యాలు కావు; కష్టాల కడలిలో మునిగిపోతున్న మానవుని జీవకారుణ్యంతో కౌగలించుకొని దరికిచేర్చే జీవితనౌకలు. అంధకారంలో అలమటిస్తున్న సకల ప్రాణులకు మార్గాములు.

విజ్ఞాన వికాసాలను విరజిమ్మే కావ్యతారకల మధ్య భాసించే పూర్ణచంద్రుని లాంటిది శ్రీమద్రామాయణ మహాకావ్యం. ఆదికవి వాల్మీకి అందించిన రమణీయ రామకథను పరిశీలించి అందలి ఆధ్యాత్మిక సౌరభమును అనుభవించెదము గాక!

భగవంతుని కృపకు పాత్రుడైన ఒక మానవుని హృదయం నుండి పెల్లుబికి, భక్తజనుల మానసములకుచేరి, దుఃఖితులైన జీవులను దేవునిగా మార్చే అమృతకలశమే రామాయణగాథ.

"సర్వేషు రమంతే ఇతి రామః" మనందరిలో రమించే దివ్య చైతన్యమే రామచంద్రమూర్తి. అతడే ఆత్మారాముడు. రాముడు దశరథుని కుమారుడు. దశరథుడనగా దశేంద్రియములను (కర్మేంద్రియములు 5—జ్ఞానేంద్రియములు 5) జయించినవాడని అర్థం. అతని రాజధాని అయోధ్య. అయోధ్య అనగా పోరాటము లేనిచోటు అని అర్థం. మానవ హృదయం నిరంతరము సుఖదుఃఖములు, జయాపజయములు, మానావమానములు, రాగద్వేషముల పోరాటముతో కలత చెందుచున్నది. ఏ హృదయములో ఈ నిరంతర ద్వంద్వపోరాటము లేదో ఆ హృదయమే అయోధ్య. దానిని పాలించువ్యక్తి దశరథుడు. దశేంద్రియములను స్వాధీనపరచుకొని హృదయములో పోరాటములణిగిన వ్యక్తికి రాముడుదయించును. ఆత్మ అచలం కనుక రాముడు కూడ అచలం. ఆత్మయైన రాముడు చలించాలంటే మనసు అవసరం. ఆ మనస్సే సీత.

మనసొక ఇంద్రజాలము. నిద్రనుండి లేవగనే మనస్సు ఎలా జాగృతి కొస్తున్నదో, సమాధిలో లేదా సుషుప్తిలో ఎలా లయించి పోతున్నదో ఎవరూ గ్రహించలేకున్నారు. భూమినుండి వచ్చిన సీత భూమిలో కలసిపోవడం కూడ అలాగేవుంది.

సీతారాముల వివాహం ఎప్పుడు జరిగిందో అప్పుడు రాముడు అయోధ్యను వీడి అరణ్యానికి వెళ్ళవలసి వచ్చింది. సుఖసాగరంలో ఈదులాడే ఆత్మ ఎప్పుడైతే మనస్సుతో కలిసిందో జీవితమనెడి అరణ్యములోకి ప్రవేశించాల్సి వచ్చింది. సీత రామునే చూస్తూ, రాముని కొరకే జీవిస్తూ, రాముని కన్నా అన్యంగా తనకేదీ అవసరంలేదని భావించినంతవరకు తన ఆనందానికి హద్దులేదు.



అయోధ్యకు అరణ్యానికి తేడా తెలియలేదు. పట్టు వస్త్రాలకు నారచీరలకు తారతమ్యం కనుపించలేదు. బంగారు పాన్పుకు, గరిక నేలకు భేదం అర్థంకాలేదు.

కానీ సీత దృష్టి ఒక్కసారి బహిర్ముఖమైనది. వెంటనే బంగారు జింక కన్పించి మోసం చేసింది. ఈ దృశ్యమాన ప్రపంచములో ప్రతి వస్తువు బంగారు జింకలా మనల్ని భ్రమింపచేసి బాధించేదే. రాముడు వద్దని వారించినా సీత వినలేదు. ఆశ మంచిది కాదు. వస్తుప్రపంచములో సుఖంలేదని బుద్ధి ఎంతచెప్పినా మనస్సు వినదు.

రాముడు మృగాన్ని తరుముకుంటూ వెళతాడు. చెదరిన మనస్సుకు సమస్యలే సంతానం. రాముని పోగొట్టుకొన్న సీత లక్ష్మణుని నిశితంగా విమర్శించి దూషించడములో ఆంతర్యం అంతే. అనివార్యమైనందున లక్ష్మణుడు తాను గీచిన హద్దు దాటవద్దని సీతకు చెప్పి అన్నను అన్వేషిస్తూ వెళ్తాడు.

ఎప్పుడయితే మనస్సనెడి సీత హద్దునుదాటిందో దశరథుని రాజ్యమునకు దూరమై దశకంఠుని పాలైంది. దశకంఠుడనగా దశేంద్రియములకు దాసుడని అర్థం. దశకంఠుడైన రావణుడు సీతను లంకకు చేర్చాడు. కానీ ఇక్కడొక మహత్తర సందేశముంది. రామునికి దూరమైన సీత, రాముని సాన్నిధ్యంలో అనుభవించిన శాంతిని మరువలేక సదా రామధ్యానంలో నిమగ్నమైంది. రామచింతనలో సీత శోకానికి దూరమయ్యేది. అందుచేతనే సీత అశోకవృక్షము క్రింద నివసించిందన్నారు. సీత రామునికై ఎంతగా విలపిస్తున్నదో రాముడు సీతాన్వేషణలో అంతగా ఆవేదనకు గురికావడం రామాయణములో వెనువెంటనే చూడవచ్చు. భక్తుడు భగవంతుని కొరకు పరితపించాలేగానీ భగవంతుడు "గోవు వెంటదగులు కోడె భంగి" భక్తుని అనుసరిస్తూనే వుంటాడు.

సీతను పొందాలంటే దశకంఠుని వధించాలి. అందుకు వానర సహాయం అవసరం. వానరుడనగా కోతి. మన సంకల్పాలు కూడా కోతులే. కోతి అస్థిరము, చంచలము. మన ఆలోచనలు కూడా అస్థిరము, చంచలమైనవి. కోతి ఒక కొమ్మమీద వుండదు. మన సంకల్పాలు ఒక్క విషయముపై వుండవు. ఈ వానర రాజ్యానికి రాజు వాలి. వాలి అనగా కామం అని అర్థం. మన సంకల్పాలకు కూడా కామమే కారణము. కోరిక లేకపోతే ఆలోచనలే వుండవు. రాముడేతెంచిన రాజ్యంలో కాముడుండలేడు. శ్రీరాముడు వాలిని వధిస్తాడు.

వానరులంతా స్వాధీన మౌతారు. ఎప్పుడైతే కామాన్ని జయిస్తామో అప్పుడ సంకల్పాలను స్వాధీనపరచుకోగలం. అదే యోగం. "యోగః చిత్తవృత్తి నిరోధః" అని పతంజలి యోగదర్శనము.

అయితే వాలిని ఎందుకు వెనుకనుంచి చంపాలి? కామాన్నెప్పుడూ వెనకనుంచే చంపాలి. ఒక వ్యక్తికి తీపి పదార్థాలంటే చాలా ఇష్టం. కొంత కాలానికి అతనికి షుగర్ వ్యాధి వచ్చింది. తీపి తిన కూడదు; ప్రమాదమని వైద్యుడు సలహా ఇచ్చాడు. ఇప్పుడతను తీపి తినడమనే కామాన్ని జయించాలి, ఎలా? తన కిష్టమైన తీపి పదార్థాలన్నీ ముందుంచుకొని "నేను తీపి తినను, కామాన్ని జయిస్తాను" అనుకుంటే పర్యవసాన మెలా ఉంటుందో ఆలోచించండి. చూస్తున్నకొద్ది నోట్లో నీరూరడం, మరికొంత సేపయ్యేసరికి తన శక్తి సగం తగ్గి పదార్థాలకు శక్తి ఎక్కువౌతుంది. అలాగే వాలి ఎదుట ఎవరు నిలబడ్డా సగం శక్తిని హరిస్తాడు. అందుకని తీపి పదార్థాలను ముందుంచుకోవడం కాకుండ వాటిని వెనుకకు నెట్టాలి. వాటి దర్శనం కూడా మంచిది కాదు. ఆ విధంగా కామాన్ని వెనుక నుండే చంపాలి. రాముడదే చేసాడు.

రామ మంత్ర మహిమ నెఱిగి, రామ నామోచ్చారణతో తన మాంసాణువులను సైతం మంత్రాణువులుగా మార్చుకొన్న అపూర్వ వ్యక్తి హనుమంతుడు. సీతాన్వేషణలో లంకకుచేరి జానకిని దర్శిస్తాడు. రామ సందేశాన్ని వినిపిస్తాడు. సీతాదేవి కలలు నిజమని నిరూపిస్తాడు. భగవంతుడు భక్తుని వృథాచేయడని చాటుతాడు. "నమే భక్త ప్రణశ్యతి."

ఆంజనేయుడే గురుదేవుడు. జీవుని దేవునిగా మార్చే అమృత మూర్తి సద్గురువు. భక్తునికి భగవంతునికి మధ్య వారధి నిర్మిస్తాడు.

రాముడు దశకంఠుడైన రావణుని సంహరించి, సీతను తన స్వంతం చేసుకుంటాడు. అయోధ్యలో రామ పట్టాభిషేకం జరుగుతుంది. హృదయాంతర్యామియైన రామునితో మనస్సనెడి సీత అయోధ్య అనెడి హృదయములో కలసి కరిగిపోవడమే పట్టాభిషేకం. అదే రామ రాజ్యం. ప్రతి మానవ హృదయం రాముడేలే రాజ్యంగా మారాలి.

'మృత్యోర్మా అమృతంగమయ'

## ఆనందము – అన్వేషణ

కదులుతున్న కాలంలో, చెదురుతున్న కలల మధ్య, ముసురుతున్న చీకట్లను చీల్చుకుంటూ మానవుడు వెలుగుకోసం వెతుకుతున్నాడు. విలపిస్తున్నాడు. ప్రశాంతిని పట్టుకోవాలని వస్తుప్రపంచములో అన్వేషిస్తున్నాడు; అలసిపోతున్నాడు. ఉన్నవస్తువు లేనివస్తువును గుర్తుచేసి బాధిస్తున్నది. వ్యర్థమైన "నేడు" అర్థంకాని "రేపటి"ని ఊహించ మంటున్నది. ఆదాయంతోపాటు అవసరాలు పెరుగుతున్నాయి. ఆసుపత్రులతోపాటు రోగులు కూడా ఎక్కువౌతున్నారు. ఏదో అర్థంకాని ఆవేదన– తీరని తపన– అసంతృప్తి– అస్వస్థత– హృదయాన్ని పిండుతున్నాయి. ఇదొక విశ్రాంతిలేని ప్రయాణమైంది; ప్రయోజనంలేని పోరాటమైంది.

తెలుసుకోవాలని ఎంత ప్రయత్నించినా జాడ తెలియడంలేదు. ఆంతర్యం అంతుపట్టడం లేదు. అలాగని ప్రయత్నం మనసునుండి దూరం కావడంలేదు; అన్వేషణ ఆగడంలేదు. ఆనంద నందనవనంలో విహరించాలని, వికాస కెరటాలతో నిండిన సుఖసాగరంలో ఈదులాడాలని, ఆ మధుర నాదంలో కరిగిపోవాలని అందరూ కలలు గంటున్నారు.

పరిమిత ఫలితాలుగల ఈ దృశ్యమాన ప్రపంచములో శాశ్వత సుఖం లభించదు. దోచుకోవడం – దాచుకోవడంతో జీవితంలో అశాంతి పెరుగుతున్నదేకాని శాంతి లభించడంలేదు. అయితే సంపూర్ణ సుఖశాంతులు మానవునికి లభించే మార్గమేది? తన్ను తాను తెలుసుకోవడమే నని వేదాంత సందేశం. తన్ను తాను తెలుసుకోవడమంటే తన స్వరూప స్వభావాలను తెలుసుకోవడమని అర్థం. దానిని తెలియచేయు చదువే ఆధ్యాత్మ విద్య. మానవుని స్వభావ స్వరూపాలేమిటి?

ఎప్పుడూ తాను ఉండాలని ప్రతివాడు ఆశిస్తాడు. అభిలషిస్తాడు.... నిత్యమూ ఎందరో మృత్యుగర్భంలో కలిసిపోవడం చూస్తూ తనుమాత్రం

శాశ్వతంగా ఉండాలని కాంక్షిస్తాడు. అలా అనుకోవడంలో తప్పులేదు. ఆ కోరిక వాస్తవానికి గీటురాయి; సత్యానికి సంకేతము.

నీ వెవరివని ప్రశ్నిస్తే నేను ఫలాన వ్యక్తినని వ్యవహారం కొరకు పెట్టుకున్న పేరును చెబుతాడు. వ్యక్తులతో తన సంబంధాలు గుర్తుతెచ్చుకుంటూ నేను ఆయన కొడుకుని, ఈయన తండ్రిని, ఆమె భర్తని అని జవాబిస్తాడు. ఇలా రమ్మంటే శరీరంతో దగ్గరకువచ్చి తాను శరీరమని ఋజువు చేస్తాడు. ఆలోచిస్తున్నానంటూ తాను మనసునని, నిశ్చయిస్తున్నానంటూ తాను బుద్ధినని ధృవపరుస్తాడు. శారీరక మనోబుద్ధులు మారుతున్ననూ, సంబంధ బాంధవ్యాలు శిథిలమైననూ వీటికి కారణమైన "నేను" మాత్రం మారడంలేదు. మారుతున్న వాటిని గ్రహించాలన్నా, గుర్తించాలన్నా మారనిది, చలనరహితమైనది ఒకటుండాలి. అదే నేను. ఈ "నేను" మారేదికాదు; నశించేదికాదు. శరీరం నశించినా నేను నశించడంలేదు. "నహన్యతే హన్యమానే శరీరే" కనుక ఎప్పుడూ ఉండాలని జీవి ఆశించడంలో తప్పులేదు. అది అతని స్వభావము. ఇలా ఎప్పుడూ ఉండటాన్ని వేదాంత పరిభాషలో "సత్" అంటారు.

జ్ఞానపిపాసియైన మానవుడు ప్రపంచంలో అన్నీ తెలుసుకోవాలని తపిస్తుంటాడు. విశ్వజ్ఞానమంతా ఆపోశించాలని ఆరాటపడుతుంటాడు. ప్రయత్నించి క్రొత్తవిషయాలు తెలుసుకుంటూ వుంటాడు. అలా క్రొత్తవిషయాలు తెలుసుకుంటున్నప్పటికి తనకు తెలియనివి, తాను తెలుసుకోవలసినవి చాలా వున్నవనే సత్యం వెంటాడుతూనే వుంటుంది. కాని ఈ వస్తుజ్ఞానాన్ని, విషయతత్త్వాన్ని గ్రహించే పరికరము మాత్రము ఒక్కటే. అది జ్ఞానమయము. అది వ్యక్తి లోపలి వస్తువై యున్నది. సూర్యుని తేజస్సుచేత ప్రపంచము తెలియులాగున మానవునిలోని జ్ఞానప్రకాశము చేత సర్వమూ తెలియబడుచున్నది. ఒక్కదాని పరిజ్ఞానముచేత అన్నిటియొక్క స్థితిగతులు తెలియుచున్నవి. అంటే తెలియబడే వన్నియూ తెలుసుకొనే ఆ ఒక్కదాని ప్రతిరూపాలే ననుటలో సందేహము లేదు. కనుక విశ్వవిజ్ఞానమంతా మానవునికి క్షణమాత్రములో కలుగవలసి యున్నది. మరుక్షణంలో కలుగుతుంది అంటే ఈ క్షణంలో కూడా కలిగియున్నట్లే అర్థం. ఇప్పుడులేనిది అప్పుడు రాదు.



"అప్పుడు, అక్కడ" అనేవి "ఇప్పుడు – ఇక్కడ"గా మారాలి. ఇప్పుడు అప్పుడు అనేవి కాలంలో వస్తాయి. జ్ఞానము కాలాతీతమైనది. నాకు ఆ విషయం తెలియదనడం సబబుకాదు. అలా అనడంతోనే నీకు తెలుసునని ధ్వనిస్తున్నది. "నాకు అది తెలియదు" అనేది తెలియకపోతే 'నాకు ఆ జ్ఞానము లేదు' అనే జ్ఞానము నశిస్తే చాలు. ఇక అజ్ఞానమే లేదు. వుండేది నీవే. నీకన్నీ తెలుసు. నీకు తెలిసినవే గాక నీకు తెలియని విషయాలు కూడా నీకు తెలుసు. దీనినే వేదాంత పరిభాషలో "చిత్" అంటారు.

ప్రతి వ్యక్తి హాయిగా, సుఖంగా జీవించాలనుకుంటూ వుంటాడు. సుఖాన్వేషణే ప్రతికర్మకు పునాది; ప్రేరణ. ఆనందం కావాలి. అది ఎక్కడ నుండి వస్తుంది? ఆనందమే నీవు. ఆనందం నీలోనే యున్నది. అది నీ స్వభావము. నీవు గాఢనిద్రలో వున్నప్పుడు నీకు ఆనందం కలుగడానికి అదే కారణము. సూర్యోదయ దర్శనం కొరకు పడమటి వైపు తిరిగినట్లు, ఈ సత్యం తెలియక వస్తుప్రపంచములో, దుఃఖమయ జీవితంలో, నిస్సార సంసారంలో మానవుడు ఆనందంకోసం దేవులాడు తున్నాడు.

ఎప్పుడూ ఉండటం 'సత్', అన్నీ తెలియడం 'చిత్', ఎప్పుడూ సుఖంగా, హాయిగా వుండటమే "ఆనందం". ఈ మూడు ఆత్మలక్షణాలు. సచ్చిదానందమే నీ స్వభావము.

ఆత్మ చైతన్య స్వరూపం గనుక అందులో అపరిపూర్ణత లేదు. కనుక ఆత్మ అనంతము. అనంతమైన దానికి కోరికలుండవు. కోరుకోవడానికి మరొకటి ఉంటేకదా! అందుచేత సదా ఆనందం. ఆత్మానందాన్ని పెంచేవారు లేరు. తగ్గించేవారు లేరు.

"పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే."

నీ స్వభావము – స్వరూపము అయిన ఆత్మయందు మనస్సును లయంచేసి, కోటి సూర్యప్రకాశంతో విరాజిల్లే ఆత్మలో ఆత్మవిదుడవై, ఆప్తకాముడవై జీవించమని సర్వవేదాంత సిద్ధాంత సమన్వయ సందేశం.

----" ఓం తత్ సత్ " ----

# ప్రేమాంజరి

ప్రేమ అనేది ప్రతి వ్యక్తికి నైజము. సహజము. ప్రపంచం ప్రేమలోనే ఆవిర్భవించింది. ప్రేమలోనే స్థిరమై యున్నది. ప్రేమలోనే లయిస్తుంది. ప్రేమలేని బ్రతుకు ఎడారి బ్రతుకు. ప్రేమలేని హృదయం కొడిగట్టిన దీపం వంటిది. మానవ హృదయం నుండి సదా ప్రసరించే ఆ ప్రేమ వస్తువులకో, వ్యక్తులకో పరిమితమై యుంటుంది. అశాశ్వతమైన వస్తు ప్రపంచమువైపు ప్రసరించే ప్రేమ చవిటినేలలో పడిన బీజమై వృథాపోతుంది. ఆ ప్రేమే అన్యవస్తువులను వదలి శాశ్వతుడు, సనాతనుడు అయిన భగవంతుని పూజ్య చరణారవిందములయందు లగ్నమయితే దానినే భక్తి అంటారు. భగవద్భక్తి నిర్మలము, నిర్వ్యాజకము, నిశ్చలము. అట్టి భక్తినిచేయు పవిత్ర ప్రేమజీవి భక్తుడు.

దారి తెలియక, దిక్కుతోచక తాపాగ్ని చల్లార్చుకొనుటకై వనమంతా పరిభ్రమించిన గజేంద్రుడు చివరకు ఒక కొలనులో కాలు పెట్టాడు. అర్థంకాని జగత్తులో అనర్థమేమిటో అంతుపట్టక వాంఛా దావానలంచే అగ్నిగోళంలా మారిన హృదయంతో జీవిత కంటకారణ్యములో సుఖం కొరకు అన్వేషిస్తున్న మానవుడు ఇంద్రియ సుఖాలనే కొలనులో కాలు పెట్టాడు.

కొలనులో దిగిన గజేంద్రుని మొసలి పట్టుకుంది. విషయసుఖాలకు బానిసయైన మానవుని భ్రాంతి అనే మొసలి పట్టుకుంది.

తన శక్తినంతా వుపయోగించి చివరిక్షణం వరకు గజేంద్రుడు పోరాడాడు. కానీ తన ప్రయత్నమంతా నిరుపయోగమైంది. అలాగే విషయసుఖాల జడివాన నుండి తప్పించుకోవాలని, దుఃఖమయ సంసార పెనుగాలుల బారినుండి రక్షింపబడాలని మానవుడు చేస్తున్న ప్రయత్నాలన్నీ విఫలమౌతున్నాయి.

తన శక్తిపై విశ్వాసాన్ని కోల్పోయిన గజేంద్రుడు దీనదయాళుడైన భగవంతుడే శరణ్యమని నిండు హృదయంతో ప్రార్థిస్తాడు. గజేంద్రుడు శరణాగత భావంతో ఊర్ధ్వంగా భగవంతునికేసి చూడగానే – భక్తవత్సలుడైన భగవంతుడు సుదర్శన చక్రముతో మొసలి శిరస్సును ఖండించి గజేంద్రుని విముక్తుని చేసాడు.

తాను నిర్మించుకున్న ఆశాసౌధాలు పేకమేడలై కూలిపోగా ఆశించినది పొందలేక, నిరాశా నిస్పృహలకు నిలయమైన మానవుడు అశ్రుపూరిత నేత్రాలతో భగవంతుని ఆశ్రయించగనే– దీనబాంధవుడైన భగవానుడు తన చల్లటి చూపులతో అభయప్రదానం చేస్తాడు. భక్తుడు భగవంతుని, భగవంతుడు భక్తుని గాంచిన ఆ దివ్య సంఘటన అనిర్వచనీయం. అట్టి దర్శనమే సంసార చక్రమును ఖండించి జీవుని దేవునిగా మార్చే సుదర్శన చక్రము. మానవుని ఈ మహాప్రస్థానమే గజేంద్ర మోక్షము.

కనుకనే 'అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ' భక్తికి మించిన సాధన లేదంటూ నారద మహర్షి భక్తి సూత్రాలలో వివరిస్తారు. ప్రేమ జీవనమే దివ్య జీవనము. ప్రేమే చివరకు జయిస్తుంది. ప్రేమకు అపజయం తెలియదు. ప్రేమ ఓటమి నంగీకరించదు. ప్రేమకు అసాధ్యమంటూ లేదు. రామభక్తితో హనుమంతుడు సముద్రాన్ని దాటాడు. కృష్ణ ప్రేమతో మీరాబాయి విషాన్ని అమృతంగా మార్చింది.

ప్రకృతి సహజధర్మమే ప్రేమ. ప్రేమకు ఆశలు లేవు. అందించడమే గానీ అందుకోవడం ప్రేమకు తెలియదు. సకల జీవులకు జీవనాన్ని ప్రసాదించి కాపాడే సూర్యభగవానుడు తిరుగ ఏమీ ఆశించడము లేదు. వికాసాన్నిచ్చి మనోల్లాసం కల్గించే చంద్ర, తారక వసంతాలు ప్రతిఫలాన్ని కోరడంలేదు. వర్షించే మేఘము, పరుగిడే నదులు, వృక్షాలు, పశు పక్ష్యాదులు నిష్కామ్యంగా ఎన్నో విధాలుగా మానవ జీవనానికి ఉపకరిస్తూ ఉపయోగపడుతున్నవి.

ప్రేమ నేత్రాలకు దోషాలు కనిపించవు. ప్రేమరాజ్యంలో ద్వేషానికి, ద్రోహానికి, మోహానికి, మోసానికి తావులేదు. ఎంతటి కష్టాన్నయినా ప్రేమ

సుఖంగా మార్చుకోగలదు. పితృదేవతలపై నున్న ప్రేమచే శ్రీ రామచంద్రుడు అడవికి వెళ్ళడానికి కూడా సంశయించలేదు. ప్రేమకు అలసట లేదు; ఆవేదన రాదు.

ప్రేమకు పరిధిని కల్పించలేరు; అవధిని ఏర్పరచలేరు. ప్రేమ సర్వాంతర్యామి. ప్రేమకు జాతి వర్ణ మత లింగ విచక్షత లేదు. రామధ్యానంతో పంచప్రాణాలు నిలబెట్టుకొని రామ సాన్నిధ్యంలో కైవల్యసిద్ధి పొందిన జటాయువు ఒక పక్షి. రామ నామోచ్చారణతో తన మాంసాణువులను సైతం మంత్రాణువులుగా మార్చిన భక్తాగ్ర గణ్యుడు హనుమంతుడు ఒక కోతి. రామ దర్శనానికై తీవ్ర నిరీక్షణ సల్పి రామచంద్రుని హస్తాలలో లీనమైన శబరి హీనకులజ. శరణాగత భావంతో రాముని హృదయంలో చోటు సంపాదించుకొని రామ చంద్రుని కృపకు పాత్రుడైన విభీషణుడు ఒక రాక్షసుడు. పిడికెడు అటుకులతో వాసుదేవుని తన స్వంతం చేసుకున్న కుచేలుడు ఒక నిరుపేద. జగన్నాథుడు, సృష్టికర్తయైన శ్రీ కృష్ణపరమాత్మను బృందావనంలో ఆడించిన గోపికలు ఏ శాస్త్రమూ తెలియని అమాయకులు. ఏ వేదమూ చదువని అబలలు.

ప్రేమించు .... ప్రేమను పంచు

ప్రేమలో చరించు ... ప్రేమకై తపించు

ప్రేమతో జీవించు ... ప్రేమకై మరణించు

-: సాత్వస్మిన్ పరమ ప్రేమ రూపా :-

శ్రీ కృష్ణార్పణమస్తు

# మనిషి – మనసు

జీవితమనే సముద్రములో ఈదుటకు దిగినపుడు సమస్యలనే తరంగములకు దూరంకావడం దుర్లభం. ప్రతివ్యక్తి తన జీవితంలో ఎన్నో సమస్యల నెదుర్కొంటూ వుంటాడు. అపరిష్కృత సమస్యలతో అలసిపోతుంటాడు. ఏ క్షణమైననూ తనకొరకే ఎదురు చూస్తున్నట్లు కొన్ని సమస్యలను చేతపట్టుకొని, వాటి పరిష్కారానికి భగీరథప్రయత్నం చేస్తుంటాడు. ఇదొక అంతులేని పోరాటం; శాంతిలేని ఆరాటం. ఉయ్యాలలో ప్రారంభమైన ఈ కల్లోలం శ్మశానంలో కూడా విశ్రాంతిని పొందటంలేదు. అలాగని మానవ మస్తిష్కంలో రగిలే వాంఛా దావానలం చల్లారడం లేదు. హిమవంతుని మంచులోని తెల్లదనాన్ని అలుముకోవాలని, ఉదయభానుని అరుణకాంతులలోని సింధూరాన్ని తిలకంలా ధరించాలని , గంగామాత ఒడిలోని చల్లదనాన్ని ఉల్లమందు నింపుకోవాలని, కోటి సూర్యసమప్రభావమై వెల్గొందాలని, ఆకాశంలో అనంతుడై ఉండాలని, నిండాలని నిత్యము ప్రతిమనిషి పరితపిస్తున్నాడు. చెట్టు తొఱ్ఱలలో వసించే ఆదిమానవుని మొదలు చంద్రమండలముపై చరించే ఆధునిక మానవుని వరకు ఇదే అన్వేషణ.

మానవుడు తన నెదుర్కొనే సమస్యలను పరిష్కరించాలంటాడే గాని వాటిని అర్థంచేసుకోవాలని ప్రయత్నించడు. ఏ సమస్యనైతే తాను పరిష్కరించాలని యాతన పడుతున్నాడో అలా జరిగినపుడు ఆ పరిష్కారమే మరియొక నూతన సమస్యకు అంకురమౌతుందని, పునాదిని నిర్మిస్తుందని గ్రహించలేకున్నాడు. సమస్యను పరిష్కరించేందుకు ప్రయత్నించుటకు బదులు సమస్యను అర్థంచేసుకొనుటకు సలుపు యత్నములో తాను నిజముగా సమస్యను పరిష్కరించిన వాడవుతున్నాడు. సమస్యలనేవి ఎక్కడనుంచో ఊడిపడేవికావు. మనం కోరి సృష్టించేవి.సమస్యలను తయారుచేసేవాడు, తాను తయారుచేసిన

సమస్యల వలలో చిక్కుకొని చిరాకుపడేవాడు మనిషే. తనలోని అసమర్థత సమస్యను ఉధృతం చేస్తుంది. .... తనలోని బలహీనతే సమస్యకు ప్రాణంపోస్తుంది. మరి ఈ సమస్యలు మనిషిలో ఎలా ఉద్భవిస్తున్నవి? వీటిని ఎవరు కల్పిస్తున్నారు? మానవునిలో సమస్యలను తయారుచేసే అదృశ్య అదృశ్య శక్తి ఒకటే....అదియే మనసు.

## మనస్సంటే ఏమిటి?

సాధారణంగా రూపం కలిగి చలనముగల వానిని చేతనములుగను, కేవలం రూపం మాత్రమే కలిగి చలనములేని వానిని అచేతనములు గను మనము భావిస్తున్నాం. కానీ మనసు ఈరెంటికోవకు చెందదడంలేదు. మనసుకు రూపంలేదు. కానీ చలన మున్నది. కనుక మనసు జడమూ కాదు–చైతన్యమూ కాదు; మరేమిటి? అదొక భ్రాంతిజన్య పరికరం..... ఎండమావి అందించిన జలాశయం....

మనస్తత్వ శాస్త్రమందు ప్రభావితులై విశ్వవిఖ్యాతి గాంచిన మేధావులందరు మనసును గూర్చి ఎన్నో ప్రయోగాలు చేశారు; చేస్తున్నారు. వారి నిరంతర కృషి ఫలితంగా, వారు సల్పిన ప్రయోగజనిత విజ్ఞాన ప్రతిఫలంగా మనో చేష్టలను గురించి చెబుతున్నారేగాని మనసును గూర్చి నిర్వచించి ప్రవచించలేకున్నారు. ఆ విషయంలో ఆధునిక మనస్తత్వ శాస్త్రవేత్తలు హైందవ ఋషుల అడుగుజాడలను కూడా గుర్తించ లేకున్నారు.

ఆప్తకాములైన ఉపనిషద్రుషులు మనసును గూర్చి యథాతథంగా చర్చించక ఒక చక్కటి ఉదాహరణతో బోధపడేలా చేశారు. ఒక జీవనదితో పోల్చారు.

నది అంటే ఏమిటి? ఒక బిందెడు నీరు పోయగానే అది నది కాబోదు. ఎడతెగక ప్రవహించినపుడే అది నది అనిపించుకుంటుంది. ఆ ప్రవహించే నీటిని బట్టే నది స్థితిగతులు నిర్ణయమౌతాయి ..... నది మురికిగా ఉన్నదంటే ఆ ప్రవహించే నీరు మలినంగా వున్నదని అర్థం. నది శుభ్రంగా ఉన్నదంటే ఆ ప్రవాహ జలం పరిశుద్ధమైనదని భావన. అలాగే నది లేదు అంటే నీళ్ళు ఇంకిపోయినవని అర్థం.



మనసుకూడా అలాంటిదే. సంకల్ప ప్రవాహమే మనసు. సంకల్పాలు జరగడంలో మనసు తయారవుతుంది. సంకల్పాలు ఆగిపోతే మనసు లేదు. గాఢ నిద్రలో మనకు ఆలోచనలు లేవు. అందుచేత అక్కడ మనసు లేదు. సంకల్పాలను బట్టే మనసు. సంకల్పాలు ఋజు మార్గంలో వుంటే మనసు ఋజు మార్గంలో పయనిస్తున్నదని అర్థం. పవిత్ర భావాలు కలిగి, శుద్ధ మనసవుతుంది. చెడు ఆలోచనలు, దుష్ట భావాలు కలిగి అశుద్ధ మనసవుతుంది.. లాటరీకి సంబంధించిన సంకల్పాలు నడిస్తే ఆ మనసు జూదగాంద్రను తయారుచేస్తుంది. తనలో నడిచే సంకల్పాల ననుసరించే ఒక వ్యక్తిని మహాత్ముడని, హంతకుడని, మంచి వాడని, చెడ్డవాడని నిర్ణయించడం జరుగుతుంది.

మానవుని సుఖదుఃఖాలకు మనసే కారణం. "మనసే మనిషి" అని గ్రహించడమే రహస్యమైన సత్యమని వేదాంత పంచదశిలో విద్యారణ్యులవారు సెలవిచ్చారు. సాధారణంగా ఆలోచించే పరికరము మనసని చాలామంది అభిప్రాయపడుతుంటారు. యథార్థానికి ఆలోచన లేకుండా మనసు క్షణం ఉండలేదు. ఆలోచించటమే దాని స్వభావం. కనుక ఆలోచన వున్నంతవరకు మనసున్నది. మనసున్నంతవరకు ప్రపంచమున్నది. ప్రపంచమనేది మనసు ద్వారా ప్రతిఫలించిన ఆలోచనల సంపుటేకాని మరొకటి కాదు.

కనుక మనసంటేనే ఏమిటో తెలియనపుడు అది అందించే సమస్యలను పరిష్కరించడమేమిటి? పరిష్కరించేవారెవరు? అయితే మనసేమిటో అర్థం చేసికోవాలని మనసుతోనే ఆలోచించడమనేది నాలుకతో నాలుకను రుచిచూచి నట్లున్నది. కల కనేవారికి అది కలయని తెలియదు. తెలిస్తే స్వప్నానుభూతి కూడా మిగలదు. తాను జాగ్రదవస్థకు వచ్చినపుడే కలను గుర్తించగలుగుతున్నాడు. కనుక స్థితి మారినపుడే అవగాహన సంపూర్ణమౌతుంది.

మనం జరిపే ఆలోచనలన్నీ మనసులో శాశ్వతమైన ముద్రను వేస్తుంటాయి. ఉదాహరణకు గ్రామ్‌ఫోన్ రికార్డును తీసుకుందాం. ఆ రికార్డును గ్రామ్‌ఫోన్‌పై వుంచగానే సూదికి అంటుకొని పాడుతుంది. అంటే రికార్డులో అంతకుపూర్వమే పాట చోటుచేసుకున్నదని అర్థం. రికార్డులో పాట ఎప్పుడు తయారవుతుందో,

ఏర్పడుతాయి. ఇప్పుడు రికార్డులో వెంటనే ఆ రికార్డుపై పల్లవములు (Groves) ఏర్పడుతాయి. ఇప్పుడు రికార్డులో ఏర్పడిన పాటను తొలగించాలంటే రికార్డును ముక్కలు చేయడంకన్నా మరో మార్గం లేదు. అలాగే మనసులో ముద్రించబడిన సంకల్ప పల్లవములను తొలగించాలంటే, ఆ వాసనలను నశింపచేయాలంటే మనసును లేకుండా చేయడమే మార్గం.

మనసు ఎల్లప్పుడు బహిర్ముఖ ప్రజ్ఞ కల్గివుంటుంది. వస్తు ప్రపంచములో ఆనందం కొరకు ప్రాకులాడుతుంటుంది. శాశ్వతమైన ఆనందం ప్రపంచములో ఎక్కడా లేదుగనుక ఒక వస్తువునుండి మరొక వస్తువునకు కోతి కొమ్మకొమ్మకు తిరిగినట్లుగా ప్రయాణంచేస్తూ అలసి సొలసి నిరాశ పొలవుతుంది.

మనసే మనిషి కనుక మనసును ఆరోగ్యంగా తయారు చేసుకోవడమంటే మనల్ని, మన భవిష్యత్తును తీర్చిదిద్దుకోవడమని అర్థం.ప్రాపంచికవ్యామోహాలకు లోనైతే పశుప్రాయుల మవుతాము. అనంతుడైన భగవంతుని గూర్చి చింతిస్తే భగవంతుడే అవుతాము. ఇందులో సంశయమే లేదు. పశుప్రాయుడై దారిదోపిడి చేసి, అమానుషంగా ప్రవర్తించిన కిరాతకుడునూ – జీవకారుణ్యంతో హృదయ నైర్మల్యం కలిగి పవిత్ర రామాయణ ఆదికావ్యాన్ని అందించిన పుణ్యపురుషుడు వాల్మీకియూ ఒకే శరీరములో వున్నారు. మనసు నడకే మనిషి గమ్యాన్ని నిర్ణయిస్తుంది – సృష్టిస్తుంది.

మరి ఈ మనసును ఎలా అంతం చేయాలి? మనసును జాగ్రత్తగా పరిశీలించండి. అది చాలు. అంతకన్నా చేయవలసిందేమీ లేదు. మీరు మనసును పరిశీలించగానే అది ఆగిపోతుంది. అలా ఆగిపోవడంలో శాంతిని పొందగలరు. శాంతి సముద్రంలో పవళించిన మనసునారాయణ చైతన్యమేగాని మనసు కానేరదు. అక్కడ మనసుకు స్థానం లేదు. అది సుఖ స్థానము. అనుభవించండి; ఆనందించండి; తరించండి; తరింపజేయండి. మనసును పొంది మానవుడవయ్యావు. మనసును దాటి మాధవుడవుతావు.

–: అసతోమాసద్గమయ :–

# క్షీరసాగర మథనం

రాతిలో ప్రతిధ్వనించే శబ్దము శిల్పము. శబ్దములో ప్రతిబింబించే శిల్పము సంగీతము. పదకూర్పులో ప్రతిఫలించే శిల్ప సంగీతమే సాహిత్యము.

రాతిలోని మాటలు శిల్పి వినగలడు. సంగీతములోని శిల్పాన్ని గాయకుడు చూడగలడు. సాహిత్యములోని శిల్పసంగీతాన్ని కవి పానం చేయగలడు. అన్నిటిలోని ఆంతర్య సౌందర్యాన్ని వేదాంతి జీర్ణించుకోగలడు.

శిల్పి మనసులోని శిల్పనైపుణ్యం, గాయకుని గళంలోని గానమాధుర్యం, కవిహృదయంలోని సాహిత్య నందనవనం, వేదాంతి నిర్మల అంతఃకరణలోని ప్రసన్న ప్రశాంత మందహాసం, కన్నీటితో నిండిన మానవ జీవన వీథులలో పన్నీటి జల్లులు కురిపించక మానవు.

సంకుచిత బాహ్యదృష్టిగలవారికి కళలలోని ఔచిత్యం అర్థం కాదు. ఆంతరంగిక సౌందర్యం గలవారికే కళలలోని కమనీయత గోచరిస్తుంది. కళాత్మక ఊహకి సాంకేతిక పరిజ్ఞానము పునాది. సర్వ కళలకు నిలయమై, భావగర్భితమై, కళాతీతమై అప్రమేయ అనూహ్య అంబారీ వీథుల్లో వెలుగు వేదాంత శాస్త్రము తత్సంబంధిత సాంకేతిక పరిజ్ఞానము లేనివారికి అవగతము కాదు. అర్థం చేసుకోలేనివారి మనస్సులలో అపార్థం తలయెత్తే అవకాశం లేకపోలేదు.

పురాణేతిహాసములలోని సన్నివేశాలు, ఉపనిషత్తులలోని కథలు, సంఘటనలపై ఆధ్యాత్మిక అవగాహనతో నిర్మించిన సత్యశిల్పాలు విష్ణుపురాణంలో గోచరించే క్షీరసాగర మథనం పై కోవకు చెందిన సజీవ తాత్త్విక శిల్పము. సాధకుని ఆంతర్యంలో ఆత్మ సామ్రాజ్యాన్ని చేజిక్కించుకొనుటకు చేయు ప్రయత్నమే క్షీరసాగర మథనంలోని తాత్త్విక అవగాహన.

రాక్షసుల భయంకర దాడులకు నిలువలేని దేవతలు భగవానుని ఉపదేశముచే క్షీరసాగరాన్ని మథించి, అమృతాన్ని వెలికి తీయుటకు రాక్షసులతో ఒక ఒడంబడిక నేర్పరచుకొనుటకు, దానవుల సహాయంతో పాలసముద్రాన్ని చిలికి, అందుత్పన్నమయ్యే అమృతాన్ని పానంచేసి, దేవతలు చిరంజీవులై తదుపరి రాక్షస సంహారము గావించుటకు పథకము నిర్మించుకొని, సంధి చేసికొంటారు.

క్షీరసాగరాన్ని మథించేందుకు మంధర పర్వతాన్ని కవ్వముగా, వాసుకి అనే సర్పాన్ని త్రాడుగా ఏర్పరచుకొని ఒకవైపు దేవతలు, మరియొకవైపు రాక్షసులు లాగసాగిరి. ఇలా జరుగుతుండగా మధ్యలో ఎన్నో అద్భుతములు, ఆశ్చర్యవస్తువులు, బయల్వెడలినవి. అయినను వారు ఆ మహాకార్యాన్ని అంతటితో ఆపలేదు. అమృతము లభించటమే వారికి కావాలి. వారి శ్రమకు ప్రతిఫలం లభించే సమయము ఆసన్నమయినది. మంధర పర్వతానికి తాడులా కట్టబడిన వాసుకి మథనరాపిడికి అలసిపోయి బాధతో భయంకర విషాన్ని వెళ్ళగక్కింది. ఆ విషగాలులకు భయగ్రస్తులై, చెల్లాచెదరవుతున్న రాక్షస సమూహము కైలాసనాథుడైన శంకరుని శరణుజొచ్చి రక్షణకై ప్రార్థిస్తారు. దయామయుడైన శంకరుడు భరింపశక్యముగాని ఆ విషాన్ని తన అరచేతిలో నుంచుకొని, వినాశకరమైన ఆ గరళాన్ని పారవేయడం ఇష్టంలేక తానే పానం చేస్తాడు. భక్తులను రక్షించడానికి త్యాగభావంతో శంకరుడు విషాన్ని పానం చేయగా, ఈ విపత్కర పరిస్థితిని గాంచిన ఉమాదేవి భయకంపితురాలై తనభర్త కంఠాన్ని నొక్కిపట్టుకొంటుంది. అలా మ్రింగుడుబడని విషం కంఠములో నిలిచి, కమిలి, నీలివర్ణంగా మారుతుంది. దేవదానవులు మఱల పాలసముద్రాన్ని చిలకడం ప్రారంభిస్తారు. ఈసారి అమృతం పుడుతుంది. అమృతం పానం చేసినవారు అమరులౌతారు.

తాత్త్విక అవగాహన, భావసౌందర్యము, అలంకార శిల్పము తెలియనివారు ఈ కథలోని స్వారస్యాన్ని గ్రహించలేక మిడిమిడి జ్ఞానంతో మహర్షి వాఙ్మయము అర్థరహితమైనదని అసందర్భ, అప్రస్తుత ప్రసంగాలు చేస్తుంటారు.




పాలసముద్రమంటూ స్థూలంగా ఒకటుంటే అది ఎలా తయారయింది? సముద్రమంత క్షీరాన్ని అందించిన గేదెలు, ఆవులు ఎక్కడ? మేఘాలు జలాన్ని వర్షించునట్లు పాలను కుమ్మరించే క్షీరమేఘాలు గతంలో ఉండేవా? ఒకవేళ అలా జరిగే ఉంటే రసాయనిక ప్రక్రియ ద్వారా ఆ పాలు పెరుగుగా మారదా? ఇలా ఆలోచిస్తుంటే మనమొక పూడిక తెలియని అగాధంలో పడిపోతాము.

ప్రతిమానవునిలో చెలరేగే కల్లోలతరంగాలకు అలవాలమైన మనసే ఒక సముద్రము. తత్త్వచింతనగల సాత్త్విక మనసే క్షీరసాగరము. ప్రతిసాధకుడు ఆంతరంగిక శోధనచేసి అమృతత్త్వాన్ని పొందటమే క్షీరసాగర మథనంలోని ఆంతర్యం. క్షీరసాగరమనే మనసులో మంధర పర్వతమనే బుద్ధినుంచాలి. (మన్ + ధర = మనసును ధరించునది. నడుపునది బుద్ధి ) మంథర పర్వతానికి అహంకారమనే వాసుకిని తాడుగా అమర్చాలి. ప్రతివ్యక్తిలోని దైవాసురగుణాలే దేవదానవులు. ఒకవైపు దైవగుణాలు, మరియొకవైపు అసురగుణాలు, అహంకారాన్ని పట్టి చిలకడం అనే ధ్యానాన్ని కొనసాగించాలి. ప్రారంభ దశలో ఎన్నో సిద్ధులు కలుగవచ్చు. శంఖారావం, ఘంటానాదం, మురళీగానంలాంటి శబ్దాలు వినిపించడం, దూరదర్శనం, దూరశ్రవణం లాంటి శక్తులు కల్గటం, అద్భుత దృశ్యాలు కనిపించడం జరుగవచ్చు. అయినా అమృతానుభవానికి వీటిని త్యజించక తప్పదు. ఇలాగే ధ్యానం కొనసాగించగా అమృతత్వంసిద్ధించేముందు అహంకారములో ఇమిడియున్న చివరి కొద్దిపాటి వాసనలుకూడ వెళ్ళగ్రక్కటం జరుగుతుంది. అయితే ఆ వాసనా ప్రభావం మనసును, హృదయాన్ని తాకకుండా చూసుకోవాలి. అహంకారము సమూలంగా నశించి, మనసులోని వాసనలు ప్రక్షాళనం కాగానే ఆత్మదర్శనం అవుతుంది. ఆత్మానందమే అమృతపానం. అమృతపానం చేసినవారు అమరులౌతారు. ప్రతిఒక్కరు అమృతసిద్ధిని పొంది అమరులగుటయే ఈ క్షీరసాగర మథనంలోని సందేశాత్మక సమన్వయ సారాంశము.

హాలాహలాన్ని పానంచేసిన శివుడు త్యాగపురుషుడు. పరుల కొరకు తాను విషాన్ని పానం చేశాడు. శివుడు త్రినేత్రధారి. అతని మూడవనేత్రం తెరువబడగానే, ఎదుటనున్న వస్తువులు, వ్యక్తులు భస్మీపటలమవుతారు. మూడవనేత్రమనేది ప్రతివ్యక్తికీ ఉన్నది. అదే జ్ఞాననేత్రం. జ్ఞానచక్షువు తెరువబడగానే మనకు గోచరమయ్యే ఈ జగత్తు అదృశ్యమవుతుంది. జ్ఞాన తేజస్సులో అజ్ఞానాంధకారము పటాపంచలవుతుంది. అదృశ్యమైన నామరూపాత్మక ప్రపంచము స్థానే పరమాత్మ దివ్యదర్శనము గోచరమై, "వాసుదేవ స్సర్వమితి" అన్న అనుభూతి కల్గుతుంది. ఆ అనుభూతిలో అజ్ఞాన మేఘాలు చెదరిపోతాయి. ఆనంద జల్లులు కురుస్తాయి.

– తమసోమా జ్యోతిర్గమయ –

ఓం తత్ సత్





# సనాతన ధర్మపథం

మానవ జీవితానికి ప్రధాన లక్ష్యాలు ధర్మార్థకామ మోక్షాలని హిందూధర్మం నొక్కి చెబుతూంది. దీనిలో అర్థకామాలు రెండూ మానవులకు పశు పక్ష్యాదులకు సమాన ధర్మాలు. ఈ వస్తు ప్రపంచములో ఆహార నిద్రా మైథునాలకు సంబంధించిన సుఖాన్వేషణ కామం అనే పురుషార్థానికి సంబంధించినది. తాను సంపాదించిన వానిని భవిష్యత్తుకోసం భద్రపరచుకొనడం అర్థం అనే పురుషార్థానికి సంబంధించినది. ఈ రెండు మానవులకు, పశుపక్ష్యాదులకు కూడా సమానమే.

అయితే మానవుడికి విజ్ఞానం ఉండటంచేత ప్రతి పని వివేకంతో **(intellect)** చేస్తాడు. పశు పక్ష్యాదులు వాని వాని సహజాతాలతోను **(instinct)** ఉద్రేకాలతోను పని చేస్తాయి. మానవుడు బుద్ధిబలంతో ఆలోచిస్తాడు. పశువులకది లేదు కాబట్టి ఆలోచించలేవు.

కుక్కకు కాస్త తిండిపడేస్తే ఆ పడేసిన వాడిపట్ల విశ్వాసం కలిగుంటుంది. అవిశ్వాసంతో వుండలేదు. కానీ మానవుడు అవిశ్వాసంతో కూడా వుండగలడు. అలా వుండడానికి, వుండకపోవటానికి ముందు ఆలోచిస్తాడు. మానవుడికి పశువుకి మధ్య బుద్ధి అనబడే వ్యత్యాసం ధర్మా ధర్మాల మధ్యగల వ్యత్యాసాన్ని తెలుసుకోగలదు. ఈ బుద్ధి మానవుడి కొక ప్రత్యేక వరం. ఈ ప్రత్యేక ధర్మాన్ని కలిగిన మానవ శరీరానికి ధర్మ క్షేత్రమన్న పేరు కూడా వుంది. ధర్మం అన్నది మననుకు సంబంధించినది. దేశకాలాదులనుబట్టి మార్పు చెందుతూంటుంది.

ఇతర మతాల్లో ధర్మాన్ని ఒకే ఒకవ్యక్తి చెప్పారు. శాసించాడనే అనవచ్చు. వారి వారి మనసులలో ఊహించుకొని, బుద్ధితో ఉద్బోధించుకొని, జీవకారుణ్య భావంతో చెప్పారు. నిజానికి మానవుని మనసు పరిపూర్ణమైనట్టిది కాదు. అలాంటి మనసు పరిపూర్ణమైన ధర్మాన్ని ఎలా బోధిస్తుంది? అందుచేతనే

కేవలం మనోపరిమితమైన ఇతర మతాలు, అవి బోధించే ధర్మాలు అసంపూర్ణమై, విజ్ఞానవంతుడైన మానవునికి విచారాన్ని కలిగిస్తాయి. కారల్ మార్క్స్, ఫ్రాయిడ్ లాంటి మేధావుల విమర్శలకు క్రైస్తవ మతం గురికావలసి వచ్చింది. పరమ పురుషార్థమైన మోక్షాన్ని గురించి ప్రస్తావించే ధైర్యం, జ్ఞానవైశిత్యం ఆ మతానికి లేకుండా పోయింది. కాని సనాతన ధర్మం అలాంటిది కాదు. అది సంపూర్ణమైన ధర్మం. అది మోక్షాన్ని గురించి చెబుతుంది. జీవుని దేవునిగా, నరుని నారాయణునిగా మారుస్తుంది.

ప్రతి వ్యక్తి తాను ఆనందంగా వుండాలని, నిత్యుడుగా, పరిపూర్ణుడుగా జీవించాలని ఆశిస్తుంటాడు. అవి లభించకపోతే అతనికి తీరని దుఃఖం కలుగుతుంది. కారణం ఏమిటి? అవి అతని స్వరూప స్వభావాలు కావటమే. మరి తన సహజ స్వరూపమైన ఆనందం ఎలా లభిస్తుంది? మోక్షప్రాప్తి ద్వారానే. ఆ మోక్షప్రాప్తితో తరించమనే హిందూధర్మం బోధిస్తుంది. నీవు పరిపూర్ణుడవు; శాశ్వతుడవు; ఆనంద స్వరూపుడవు అని బోధించేది సనాతన ధర్మమొక్కటే.

మరైతే ఈ సనాతన ధర్మం ఎక్కడిది? వేదం చెప్పినదే. ఈ వేదానికి కర్త ఎవరు? ఏ మానవుడు కాదు. అవి అపౌరుషేయాలు. అవి సృష్టికి పూర్వం ఎప్పటినుంచో ఉన్నాయి. అవి పరమసత్యాలు. సత్యం సృష్ట్యాదినుంచే ఉందన్నారు మహర్షులు. "న్యూటన్" అనే శాస్త్రజ్ఞుడు భూమ్యాకర్షణ సిద్ధాంతాన్ని తెలుసుకున్నాడు. దాన్ని సృష్టించలేదు. అది అతనికి పూర్వమే వుంది.

సత్యమే దేవుడు. దేవుడంటే ఎవరు? అతని కోసం ఎక్కడికి వెళ్ళాలి? చర్చికా, మసీదుకా, దేవాలయానికా? నిజానికి ఎక్కడికి వెళ్ళనవసరం లేదు. వెళ్ళినంతమాత్రాన తప్పుకాదు. ఒక వ్యక్తి ఏదైనా అడిగితే తన అనుభవంలో వున్నదే అడుగుతాడు. దేవుణ్ణి గురించి అడిగితే, తన అనుభవంలో వుండబట్టే అడుగుతున్నాడు. "భగవంతుడు నాలోనే వున్నాడు. కానీ నాలో దట్టమైన అజ్ఞానపు పొరలుండుటచేత అతడు నాకు తెలియడంలేదు. అజ్ఞానం నా దృష్టిని అడ్డగించటంచేత నేనా భగవంతుని చూడలేకున్నాను. రజ్జు సర్పభ్రాంతి



వంటిది నన్ను వేధిస్తోంది. "నీవు శరీరానివి కావు. నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వరూపమైన ఆత్మవు" ఇలా బోధిస్తుంది సనాతన ధర్మం.

"ఆదిమానవుడు చేసిన పాపానికి మనమంతా శిక్ష ననుభవిస్తున్నాం" అంటుంది బైబిల్. ఎవరో పాపం చేస్తే మనం శిక్ష అనుభవించడమేమిటి? ఇది ఆలోచించవలసిన విషయం. ఒకరు చేసిన పాపాలకు మనం వారసులమయితే, అలాగే మరికొందరు చేసిన పుణ్యాలకు కూడా మనం వారసులం కావాలి...." ఏమిటీ అస్తవ్యస్త ధోరణి? ఎవరి నుద్ధరించడానికి అనాలోచిత, అశాస్త్రీయ ప్రసంగం? పాపుల నుద్ధరించడానికి ప్రేమతో తన కుమారుడైన ఏసుక్రీస్తును పంపాడట బైబిల్ భగవంతుడు. ఏసు నివసించి 1988 సంవత్సరాలు గడిచాయి. అంతకు పూర్వం ఎన్నో యుగాలు గడిచినట్లు ఆ బైబిలే చెబుతుంది. అలాగైతే యుగయుగాలుగా పాపులు జన్మిస్తుంటే, తన కుమారుని పంపి వాళ్ళని పవిత్రులుగా మార్చాలన్న సంకల్పం సోమరితనం వల్లనో, కాఠిన్యం వల్లనో, ఆ దేవుడికి 1988 సం॥ పూర్వం కలుగలేదు. ఇక అంతకు ముందు పాపుల గతేమిటి? సమయస్ఫూర్తి, జ్ఞానదృష్టి, ప్రేమ హృదయం లేనివాడు పరమాత్మ కాలేడు.

ఇరుగు పొరుగును ప్రేమించమని బైబిల్ చెబితే, సమదర్శనం కావాలంటుంది భగవద్గీత. మానవుడు పాపికాడు. పరమాత్మ స్వరూపం, అమృత స్వరూపం. అన్నిటిలో అందరిలో భగవంతుడున్నాడు గనుక, ప్రతిదాన్ని సమభావంతో చూడాలని, ప్రేమించాలని చెబుతుంది సనాతనధర్మం.

అధర్మం హెచ్చినపుడు తాను అవతరిస్తానన్నాడు భగవంతుడు. ధర్మాన్ని రక్షిస్తానన్నాడు. దేశంలో భూతబలి, జీవహింస చూడలేక, మతం పేరిట జరిగే మారణ హోమాన్ని చూసి భరించలేక జీవకారుణ్య బుద్ధితో బుద్ధుడవతరించి, బౌద్ధమతం బోధించాడు. ఆ తర్వాత నాస్తిక మతం ప్రబలింది. ఆదిశంకరాచార్యులవారు అవతరించి బౌద్ధాన్ని ఖండించి అద్వైతాన్ని ప్రబోధించారు.

ముస్లిం పరిపాలనలో మన సంస్కృతి బాగా దెబ్బతిన్నది. అందుకు సోమనాథ దేవాలయ ఉదంతం చాలు. ఆ కాలంలోనే భక్తి మార్గం ప్రబలింది. జ్ఞానదేవ్, తుకారాం, పురందరదాస్, జయదేవ్, తులసీదాస్, మీరాబాయి, కబీర్, చైతన్యమహాప్రభువు లాంటి భక్తులవతరించి ధర్మాన్ని రక్షించారు. ఆంగ్ల పరిపాలన దోషంవల్లనూ, లార్డు మెకాలే పాశ్చాత్య విద్యా విధానంవల్లను మన సంస్కృతి మరల కుంటుపడింది. తిరిగి దానిని బాగుచేయడానికి రామకృష్ణ వివేకానందులు అవతరించారు. ఇలాగ మన సనాతనధర్మం ఎప్పటికప్పుడు మహాత్ముల చేత పునరుద్ధరింప బడుతూనే వుంది.

ఇతర మతాలలోకి వెళ్ళిన మన సోదరులు తిరిగి సనాతన ధర్మాన్ని ఆశ్రయించడమనే ఈ పునరాగమన కార్యక్రమం కాలాను గుణంగా ఏర్పడింది. అస్తవ్యస్తంగా తయారైన ఒకానొక వ్యవస్థను మనం సరిచేసుకుంటున్నాం. హిందూధర్మాన్ని ధిక్కరించి అన్య మతాలను ఆశ్రయించినవాళ్ళు రెండు మతాలలోని విషయాలను, రహస్యాలను కూలంకషంగా అర్థంచేసుకొని చేరారా? కానేకాదు. ఏవేవో ఆశలకు లోబడి పరధర్మాన్ని ఆశ్రయించారు. ఇప్పుడు తమ తప్పు తెలుసుకొని తిరిగి తమ హిందూధర్మమే అన్నిటికన్న పవిత్రమైనదని అందులోకే వస్తున్నారు. అందుచేతనే ఈ పునరాగమన కార్యక్రమం మహా పవిత్రమైనదిగా భావించాలి. విశ్వహిందూపరిషత్ వల్ల, యిది వరలో జరుగనిది ఇప్పుడు జరుగుతోంది. తిరిగి మనలో కలుసుకున్న సోదర సోదరీమణులను హృదయ పూర్వకంగా ఆశీర్వదిస్తాం. హిందూ ధర్మం ప్రతి వ్యక్తినీ తన ఆత్మోన్నతి కోసమే పాటుబడమని బోధిస్తుంది.

-: అసతోమా సద్గమయ :-



# నిరాకారుని ఆకారము

తెర తొలగింది. పాత్రలు పలికాయి. కథ నడిచింది.
గాథ ముగిసింది. ఇది నాటకం.

జన్మ వచ్చింది. బ్రతుకు కదిలింది. యాత్ర సాగింది.
చితి రగిలింది. ఇది జీవితం.

కాలమనే ఎడారిలో చరిత్ర ఇసుకతిన్నెలపై కొందరి
అడుగుజాడలు కనిపిస్తాయి. కొందరివి మాసిపోతాయి.

నాటకం ప్రదర్శించాలంటే దానిని నడిపించే దర్శకు డుండాలి. కంటికి కనుపించక పోయినా ప్రతి పాత్ర హావ భావ విన్యాసాలలో అతడే తొంగి చూస్తున్నట్లు తెలుస్తుంది. అలాగే జన్మ వచ్చిందంటే దానిని ప్రసాదించినవాడు, నడిపించేవాడు ఒకడుండాలి. అతని అదృశ్య హస్తం ప్రతిచోటా కనుమరుగై కదుల్తూ వుంటుంది. అతడి ఆధీనంలో ఉన్న చట్టాలే ఈ విశ్వాన్ని పాలిస్తున్నాయి. అతని దీవెనలే దిక్కు తోచని మానవులకు వెలుగుబాటను చూపించే దివిటీలై యున్నాయి. అతడే భగవంతుడు. పరమాత్మ.

మరి అతడెక్కడున్నాడు? అతడంటూ వుంటే అంతటా వుండే వాడై యుండాలి. ఒకచోట వుండి మరొకచోట లేనట్లయితే అతడికి తన సృష్టి జ్ఞానమంతా సంపూర్ణంగా లేదని అర్థం. సృష్టిజ్ఞానమంతా ఆపోశించ లేనివాడు సృష్టిని ఎలా తయారుచేయగలడు? అలా తయారు చేశాడంటే అతడికి సృష్టిజ్ఞానమంతా కావాలి. సృష్టిజ్ఞానమంతా వున్నదంటే వాడు సర్వత్రా వ్యాపించియుండాలి. "సర్వతః పాణి పాదం తత్" మరి అంతటా తానే వ్యాపించియున్నప్పుడు సృష్టిని ఎక్కడ చేయగలడు?

సృష్టిని భగవంతుడు చేస్తే భగవంతుని ఎవరు సృష్టించారు? ఈ సృష్టి స్థితిలయాలు చేస్తున్నప్పుడు ఆ భగవంతుడు ఎక్కడున్నాడు? అతడు స్వర్గంలో వుంటే స్వర్గాన్ని తయారుచేసిందెవరు? అసలు ఈ ప్రపంచాన్ని భగవంతుడు ఎందుకు సృష్టించాలి? ఈ సృష్టి వెనుక తన మనోభావమేమిటి? ఈ విషయాలన్నీ దృష్టియందుంచుకొని ఆలోచించినపుడు సృష్టికర్త నిజంగా సృష్టిని చేసివున్నట్లయితే అపరిపూర్ణుడు కనుకనే అతనికి కోరిక కలిగి ఈ సృష్టిని చేశాడు అని అంగీకరించక తప్పదు.

ఒకస్థాయిలో మానవునికి సృష్టివాదము తృప్తినిచ్చినా మేధస్సు పెరుగుతున్న కొద్ది "చైతన్యం వినాకించి న్నాస్తి" చైతన్యం తప్ప మరొకటి లేదనే అవగాహనకు రాకతప్పదు. అందుచేతనే సంపూర్ణ జ్ఞాన స్వరూపులైన మహర్షులు స్థాయీ భేదాన్నిబట్టి తత్త్వబోధ చేస్తూ వచ్చారు. ప్రారంభదశలో నున్న విద్యార్థికి ఈ సృష్టి భగవంతుని క్రీడాజనితమని తెలిపి, అదే విద్యార్థి ఆధ్యాత్మికంగా పెరిగినపుడు అసలు సృష్టే జరుగలేదని. భగవంతుడొక్కడేయున్నాడని, దృష్టిని సవరించుకొంటే సర్వం బ్రహ్మమయమని తెలియజేసారు.

దేశ కాలాదులను దృష్టిలో వుంచుకొన్నప్పుడే మనం ఈ సృష్టిని చూడగలుగుతున్నాం. దేశకాలాదులు మానసిక భావాలే **(Concept)** కాని, మరొకటి కాదని మనకు తెలుసు. మనసు లేనిచోట అవిలేవు–మనసు జాగృతికి రాగానే దేశకాలాదులలో తెలిసివచ్చే ప్రపంచము మనోకల్పితమే కాని మరొకటి కాదు. ప్రపంచాన్ని సృష్టించేది, ప్రళయమునందు లయించేది మనసే.

మనసుయొక్క దృష్టిని మార్చాలి. దానికొక అవగాహన కల్పించాలి. మనసును ఈ భ్రాంతినుండి చైతన్య స్థాయికి తీసుకువెళితే కాని మానవునికి శాంతి లభించదు. ఇలా మనసును చైతన్యంవైపుకు మరల్చడమనే ప్రక్రియకు "ఉపాసన" అని పేరు.

అయితే ఆ చైతన్యాన్ని, ఆ భగవంతుని ఎలా ఉపాసించాలి? అతడు సగుణమా? నిర్గుణమా? అతడు ఆకారుడా? నిరాకారుడా? అంతటానిండి నిబిడీకృతమైన భగవంతుని ఒకరాయిగానో, చిత్రముగానో, ప్రతీకోపాసన



చేయడం అవివేకమని ప్రపంచ ప్రసిద్ధిగాంచిన మతాలు చెబుతున్నాయి. నిరాకారునికి ఆకారం కల్పించడం అవివేకమని ఆ మతస్థుల అభిప్రాయం.

నిజమేమరి. రాయి, చెట్టు, బొమ్మ, పుట్ట భగవంతుడు కావడానికి వీలులేదు. రాయి భగవంతుడుకాదు. కానీ భగవంతుడు రాతిలో కూడా వున్నాడు. సర్వవ్యాపి అంటే విగ్రహాలుతప్ప మిగతా ప్రదేశమందు ఉన్నాడని భావమా? రాయి దేవుడంటేతప్పు. అది అజ్ఞానం. కాని రాతిలో కూడా దేవుడున్నాడని గ్రహిస్తే అది సమ్యక్ జ్ఞానం.

బ్రహ్మమీమాంస దర్శనమునందు వ్యాసభగవానుడు "బ్రహ్మ దృష్టి రుత్కర్షాత్" అని సెలవిచ్చారు. విగ్రహములందు బ్రహ్మ భావాన్ని కలిగియుండు. కానీ బ్రహ్మమందు విగ్రహాన్ని భావించకు, ఆవిష్కరించకు అని అర్థం.

విగ్రహారాధన తప్పు అని వాదించే ఇతరమతస్థులు కూడాను అవగాహన లేకనే విగ్రహారాధన మూర్ఖంగా చేయుచున్నారు. కొయ్య ముక్కలతో చేసిన శిలువ ఎలా పవిత్రమైంది? అది విగ్రహారాధనకాదా? కొయ్యముక్కను చైతన్యంగా భావించడం కాదా? భగవంతునిపై నీకున్న భావానికి అది ప్రతీకము కాదా! మసీదులో కదులుతున్న "పీర్" ప్రతీకోపాసన అనిపించుకోదా?

బాహ్య ప్రపంచమునందు నామరూపాలకు అంకితమై వున్న మనసును నామరూపాలను ఉపాసించే మార్గంలోనే శుద్ధిచేసి బ్రహ్మ భావంలో లయంచేయాలి. అదే విగ్రహారాధనలోని విశిష్ట సందేశం. ప్రతీకములో భగవంతుని దర్శించే జ్ఞానము సరిపడగానే తనచుట్టూనున్న ప్రపంచములోను, వ్యక్తులలోను, వస్తువులలోను ఆ చైతన్యమునే దర్శిస్తూ, అందులోనే లయిస్తూ "ఏకమేవా అద్వితీయంబ్రహ్మ" అనే భావనతో తరించడమనే అద్వైత ఆధ్యాత్మిక సౌధనిర్మాణానికి ప్రతీకోపాసన పునాది.

భక్తి అంటే ఆక్రందించడమూ కాదు. యాచించడము అసలే కాదు. వ్యతిరేక పరిస్థితీ కాదు అంటారు స్వామిరామతీర్థ. భక్తి అంటే ఒక వర్ణనాతీతమైన సమత్వ బుద్ధి; ఉజ్జ్వల మాధుర్యం; దివ్యపారవశ్య సంజనితమైన నిర్లక్ష్యం. భక్తంటే సమస్తములో వాసుదేవుని దర్శించడం. ప్రతివస్తువులో నీ ఆత్మను దర్శించడం. సృష్టిఅంతయూ సౌందర్యమే, ఆ సౌందర్యం నేనే యనెడి అనుభూతినిపొందడమే భక్తి.

# చావును చంపేస్తే ....?

పుట్టడమంటూ జరిగింది గనుక చావక తప్పదు. ఈ చావుపుట్టుకలమధ్య నిలిచిందే జీవితం. జీవి పొందే అనుభవాల సారమే జీవితము. అనుభూతుల భారమే జీవనము.

శారీరకంగా మనిషి ఒకేసారి పుడతాడు. అలా పుట్టిన శరీరాన్ని ఒకేసారి వదుల్తాడు. కాని వ్యక్తి రక్త మాంసాలతో నిండిన పాంచభౌతిక శరీరమేకాదు. తనలో మనోబుద్ధులున్నాయి.అవి కల్పించే కోరికలు, సంకల్పించే యూప్సితములు మనిషిని బంధించి నిరంతరము పుట్టుకను అందిస్తున్నాయి. చావును ముందుంచుతున్నాయి. ప్రతి వ్యక్తి యీ విధంగా నిత్యము అనేకసార్లు పుడతాడు. ఎన్నిసార్లు పుడతాడో అన్నిసార్లు మరణిస్తాడు. ఈచావు పుట్టుకలు నిత్యజీవితంలో సంభవిస్తాయి. వీటిని అర్థం చేసుకునే నిమిత్తం తాత్కాలిక జనన మరణాలుగా పిలుచుకుందాము. జీవిస్తున్న ప్రతి వ్యక్తికి యీ తాత్కాలిక జనన మరణాలు తప్పవు. మనస్సులో ఒక ఆలోచన రాగానే నాలో యీ ఆలోచన పుట్టింది అంటాము. ఎంతవరకు యుంటుందా ఆలోచన? కాలంలో కదిలింది గనుక కాలంలో లయిస్తుంది. కనుక పుట్టిన సంకల్పం నశించినది. ఇది అనివార్య జీవన సత్యం.

మరి శాశ్వత జనన మరణ మేమిటి? పుట్టిన శరీరాన్ని గతించిన తరువాత చితికి అప్పగించడము చావు అయితే యిలా చచ్చేశరీరానికి గల పుట్టుకే జననము. జన్మించినది మొదలు మరణించునంతవరకు మనస్సు అనేక పర్యాయాలు పుడుతూ చస్తూ యున్నప్పటికి తనకు గలిగే శారీరక మృత్యువుగూర్చి చింతిస్తూమానవుడు భయకంపితుడవుతుంటాడు. చావును గూర్చి భయమెందుకు? నిన్ను చంపే అవకాశాన్ని చావుకు యిచ్చిందెవరు? అసలు చావు నిన్ను చంపగలదా? నిన్ను చావు అంటగలదా? మంటగలపగలదా? ఆలోచిస్తే అది యొక పెద్ద తంట. రుచితెలియని వంట.



ఏది ఎలాఉన్నా చావకూడదనేది ప్రతివ్యక్తి ఆంతర్యములో కదిలే ఆలోచన. చావాలంటే అందరికీ భయమే. ప్రపంచములో నిత్యము ఎందరో మరణిస్తున్నారు వారి విషయములో మనము దుఃఖిస్తున్నామా? లేదు.ఎందుకని? వారు మనవాళ్ళుకాదు. మంచిది. మన బంధుప్రీతికి శతకోటి వందనములు. ఇప్పుడు తెలిసినది; చావంటే మనకు భయంలేదు. మనవాళ్ళు చస్తే బాధ; చస్తారంటే భయము కలుగుతుంది. ఇది ఎంత వాస్తవమో ఆలోచిద్దాము. మనము చావు నుండి తప్పించాలనుకుంటున్న మన కుటుంబీకులు మనతో సహా అగ్ని ప్రమాదంలో చిక్కుకున్నారనుకోండి. భయంకరమైన ఆ ప్రమాదమునుండి తప్పించుకునే సందర్భములో మన ప్రాణము మనకు ముఖ్యమనిపిస్తుందే గాని మనవాళ్ళు ఏమవుతున్నారనే ప్రసక్తే రాదు. అప్పుడేం జరిగింది? మనము నిలవాలనే ఆతురతలో మనవాళ్ళ చావు కూడా మనకు నిర్లక్ష్యమే అయింది. కనుక మానవుడు ఎవరు చనిపోయినా జీవించగలడు. తాను చస్తాడంటే భరించలేడు. మరి తనలో చచ్చేదేమిటి? శరీరము. మరి ఆ శరీరములోనే ఒక అంగము క్రుళ్ళి నశించునపుడు ఆ అవయవాన్ని ఖండించి వేసినచో తాను బ్రతకగలడని వైద్యుడు సూచించగానే తాను జీవించడానికి శరీరములో ఒక అవయవాన్ని త్యాగము చేయడానికి కూడా వ్యక్తి వెనుదీయడము లేదు. ఒక అవయవము దూరము కాగానే తన బ్రతుకు సమాప్తం కాలేదు. శరీరములో ఒక అంగమునకు ఎంత ప్రాధాన్యత యున్నదో మరో అవయవానికి కూడా అలాంటి ప్రయోజనమే యున్నది. కనుక చావు అవయవానికి సంబంధించినదికాదు. సర్వాంగములు నాకు ఉపకరిస్తున్నవి. ఒక అవయవము లోపించుట వలన నా మనుగడకు భంగము వాటిల్లినపుడు యథార్థానికి నా మనుగడకు శరీర క్షయ పతనావస్థ దోషాలకు సంబంధము లేదు.

దేహినోస్మిన్ యథా దేహే
కౌమారం యవ్వనం జరా
తథా దేహాంతర ప్రాప్తి
ర్ధీర స్తత్ర నముహ్యతి.

శరీరమునందు బాల్యము, యవ్వనము, ముదిమి కలుగుచున్నట్లు మరియొక దేహమును కలుగుచున్నది. పండితుడు దేహ నాశాదులను గూర్చి మోహమును పొందడు.

మరి చావంటే భయమెందుకు? అసలు చావు ఎవరికి కలుగుచున్నది?

నాకు మాత్రం కాదు. ఎందుకని? శారీరక మనో బుద్ధులలో కలిగే తాత్కాలిక మరణాన్ని నేను చూస్తున్నాను. చూస్తున్నాను కనుక నేను చావడం లేదు. మరి శాశ్వత మరణ విషయమేమిటి? అదీ అంతే. సెకండు ముల్లు గడియారం చుట్టూ ఒకసారి తిరుగగానే నిముషాలముల్లు ముందుకు నడుస్తుంది. సెకండు ముల్లు పయనించునపుడు లేని ఆవేదన దాని పర్యవసానమైన నిముషాల ముల్లు చలించడములో ఎందుకు కలగాలి? మనలో సదా నడిచే తాత్కాలిక మరణాలే కదలి కదలి ఒకనాటి శాశ్వత మరణాన్ని తయారు చేసుకుంటాయి. మరి 'నేను'? 'నేను నశించే వస్తువుకాదు. "నేను" మరణించడము లేదు. కనుక నీవూ మరణించే ప్రసక్తే లేదు. నీ మరణము నా శాంతిని భగ్నం చేయలేదు. నా మరణము? అదికూడా అంతే. అయితే మరణిస్తామా? అయ్యబాబోయ్! మరణించటమంటే నాకు చాలా భయం. ఇంకెందుకు భయం? చావుకు నీకు సంబంధము లేదు. పుట్టిన వానికి మరణమున్నది. నీవు పుట్టలేదు గనుక మరణించేదిలేదు.

దేహీ నిత్య మవధ్యోయం
దేహే సర్వస్య భారత
తస్మాత్సర్వాణి భూతాని
నత్వం శోచితు మర్హసి

సర్వప్రాణుల దేహములలో యుండు ఆత్మ నిత్యమైనది. కనుక ఎవరిని గూర్చి కూడా దుఃఖించనవసరం లేదు.

ఈ విషయం నీకు అర్థమయితే బాధలు కలుగవు. భయాలు మిగులవు. నిన్ను చంపలేని చావునుగూర్చి సదా చింతిస్తూ చావడమెందుకు? యథార్థానికి చావు మనల్ని చంపలేదు. ఈ విషయం మనకు బాగా తెలుసు. అయినా భయం దూరం కావడం లేదు. అంతేకదూ! కారణమేమిటి? చావు నాకు కాకపోయినా చావును తలచుకుంటే నాకు భీతి కలుగుచున్నది. అయితే ఒకటి చేద్దాం. చావును చంపేస్తే? శనిపోయింది. అప్పుడేమి మిగులుతుంది? బ్రతుకు మిగులుతుంది. ఈనాడు బ్రతుకుతూ చస్తున్నాము. చచ్చే లోపల బ్రతకాలి. అర్థం చేసుకోండి. అవగాహనను పెంపొందించుకోండి. అంతఃకరణ శుద్ధి పరచుకోండి. ఆంతర్యంలో లయించండి. ఆనందానుభూతిని పొందండి. అమరులై జీవించండి. ఆప్తకాములై నిలవండి.

సాధనలకు సాక్షాత్కారానికి సంబంధంలేదు. సాధనల వలన జరిగేది అహంవృత్తి నశించడమే. మలవిక్షేప ఆవరణాదులు తొలగించబడుటయే. ఆత్మ స్వప్రకాశము. స్వయంప్రకాశము.

అహంవృత్తిని నశింపజేసే దేదైనా సాధనే అవుతుంది. అది జపం కావచ్చు, పూజ కావచ్చు, ధ్యానం కావచ్చు లేదా నేనెవరిననే విచారణ కావచ్చు. ధ్యేయవస్తువును తెలుసుకున్న తరువాత అన్ని సాధనలు అవహేళనగానే మిగిలిపోతాయి. గమ్యాన్ని చేరేటంత వరకు ఏ సాధనైనా ఉపకరిస్తుంది. ఒక సాధనకన్నా మరియొక సాధనలో గొప్ప యేమీ వుండదు. ఈ తారతమ్యాన్ని సాధకుని మనస్సు చూస్తుంది. ఏ సాధన ఆచరిస్తున్నామనేది సమస్య కాదు. ఎంత శ్రద్ధాభక్తులతో ఆచరిస్తున్నామనే దానినిబట్టి ఫలం కల్గుతుంది.

నేను ధ్యానం చేస్తున్నానని భావించడంలో అహంవృత్తి చోటు చేసుకుంటుంది. నేనెవరు? అని విచారణ చేయడంలో నేను గనుకనే యిలాంటి విచారణ చేయగల్గుతున్నానని అహం స్ఫురిస్తుంది. సాధనలో జనించిన అహంకారం సాధననే వక్రింపజేస్తుంది.

మనం అనుకున్నపుడల్లా ధ్యానం చేయగల్గుతున్నామా? విచారణ చేయగల్గుతున్నామా? కొన్ని సమయాలలోనే చేయగల్గుచున్నాము. అప్పుడు మాత్రమే భగవానుని దయ మనపై వర్షించియుంటుంది. స్వామి దయ మనపై వర్షించుటకు అనుకూలమైన రీతులలో బహుశా మనమనస్సును యుంచుకొని యుంటాము. అదే తెలియని రహస్యము. అలాగాక నిరంతరం స్వామిపైనే ఆధారపడి ఆయనే నడిపాడనుకో గలిగి జీవించగలిగితే మనస్సులో తొట్రుపాటులుండవు. అహంకారం ఉదయించదు. సాధనకు అంతరాయం కలుగదు. సకాలంలో సత్ఫలితాన్ని పొందగలము.

## వేదాంత సందేశం

ప్రపంచ రంగస్థలిపై పరమాత్మ ఆడించే నాటకంలో ఒక విచిత్రమైన పాత్రధారి మానవుడు. నాటకంలో తోటి నటులైన పశుపక్ష్యాదుల వలె గాక తాను వివేకంతో, విజ్ఞానంతో నటన సాగిస్తాడు. ప్రతి మానవుని నటనలో రెండు విషయాలు మనకు గోచరిస్తాయి. తనను వెంటాడుతున్న దుఃఖాన్ని దూరం చేసుకోవాలని, తాను ఆశించే సుఖాన్ని దగ్గర చేర్చుకోవాలని తపిస్తుంటాడు. తాపత్రయపడుతుంటాడు. ప్రయత్నాలు జరుగుచున్నవేకాని ప్రయోజనం కనుపించుటలేదు. అంతు తెలియని దుఃఖంతో, చేతికందని సుఖంతోదిక్కుతోచక పిచ్చివాడిలా ప్రయాణం సాగిస్తున్నాడు.

మానవుని స్వభావం సుఖమా? దుఃఖమా? మానవుని స్వభావం దుఃఖమే అయితే దానికి తానెన్నడు దూరంకాలేడు. స్వభావమే స్వరూపంగా ఉంటుంది. స్వభావం నశిస్తే స్వరూపమే నశిస్తుంది. తియ్యదనం పంచదార స్వభావం. పంచదార నుండి తియ్యదనాన్ని వేరు చేస్తే ఇక అది పంచదార అనిపించుకోదు. స్వభావం నశించడం వలన స్వరూపమే నశిస్తుంది. దుఃఖమే మానవ స్వభావమైతే దుఃఖం నశిస్తే తానే నశిస్తాడు. కానీ తాను నశించాలని ఎవడూ అనుకోడు. అదియునుగాక గాఢనిద్రలో సుఖం కలుగుతున్నదే గాని దుఃఖం యొక్క జాడ తెలియడంలేదు. కనుక మానవుడు సుఖస్వరూపుడు. దుఃఖం కేవలం మధ్యలో కలిగినది. ప్రయత్నించి నివృత్తి చేసుకోవచ్చు. అయితే ఆగంతుకముగా వచ్చిన ఈ దుఃఖానికి కారణమేమిటి ?

### శరీరమే దుఃఖానికి కారణము

అగ్ని వలన ధూమము ఏర్పడినట్లు దేహమువలన దుఃఖము కలుగుచున్నది. ఎక్కడ నిప్పు వున్నదో అక్కడ పొగవున్నది. ఎక్కడ శరీరమున్నదో అక్కడ దుఃఖమున్నది. శరీరమున్నవారెవరూ దుఃఖానికి దూరం కాలేరు. దుఃఖానికి ధనికులు దరిద్రులనే తేడా లేదు. రాజు పేదలనే భేదం లేదు. పండిత పామరులనే తారతమ్యం తెలియదు. స్త్రీ పురుషులనే లింగ భేదంగాని, బాల వృద్ధులనే వయోభేదంగాని లేదు. దుఃఖము దృష్టిలో శరీర మున్నవాళ్ళంతా సమానమే.



రాజుకు రాజ్యమున్నా దుఃఖం తప్పడంలేదు. దేశంలో దుర్భిక్షం, శత్రువుల దండయాత్రలు, భార్యాపుత్రులకు కలిగే వ్యాధులు, మరణాలు, తన జీవితంలో వచ్చే వయోమార్పులు, ఎదురుచూస్తున్న మృత్యువు–ఇవన్నీ దుఃఖాన్ని పంచి పెడుతూనే వున్నాయి .... దీనికి కారణం తాను శరీరధారి కావడమే ....

శాస్త్ర విజ్ఞానం సముపార్జించి, వివేకవంతు డనిపించుకొన్న పండితునికి కూడా దుఃఖం తప్పడంలేదు. ఆకలిదప్పులు, శీతోష్ణములు, జయాపజయములు, విష కీటకములు క్షుద్ర జంతువులు–ఇవన్నీ కావలసి నంత దుఃఖాన్ని అందిస్తున్నాయి. కారణం తాను శరీరధారి కావడమే.

చివరకు దేవతలు సైతం ఈ దుఃఖం నుండి విముక్తి కాలేదు. వారికి కామక్రోధాలున్నట్లు తెలుస్తున్నది. అనేక జన్మల సుకృత ఫలంగా సంప్రాప్తించిన ఇంద్రాది పదవులు– "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి" ఆ పుణ్యం కాస్తా అయిపోగానే విడిచిపెట్టి మళ్ళీ మానవుడుగా భూలోకంలో జన్మించవలసివుంది. ఇంద్రుని చేతిలో వజ్రాయుధం వుంది. ఆపద వున్నప్పుడు ఆయుధం ఎంతైనా అవసరం. రాక్షసులను సంహరించి దేవతలను రక్షిస్తాడు. ఈ బాధలన్నీ వాళ్ళకు ఎందుకు కలిగాయి? వాళ్ళకీ శరీరాలున్నాయి గనుక ... శరీరమున్న ప్రాణికి దుఃఖము తప్పదు. అయితే దుఃఖాన్నిచ్చే ఈ శరీరం ఎందుకొచ్చింది?

### శరీరానికి కర్మ కారణము

గత జన్మలో చేసిన కర్మల కారణంగా శరీరం కార్యరూపంలోకి వచ్చింది. స్థూలంగా మనంచేసే కర్మలు ప్రపంచంలో స్థూల ఫలితాలిస్తున్నప్పుడు ఈ కర్మలకు కారణమైన సూక్ష్మ వాసనల వలన సూక్ష్మ ఫలితాలు రాక మానవు. సత్కర్మయొక్క ఫలితం పుణ్య మయితే, దుష్కర్మయొక్క ఫలితం పాపం. పుణ్యకర్మ లాచరించినవారు దేవతా శరీరములను, పాపకర్మలు చేసిన వారు పశు పక్ష్యాదుల శరీరములను, మిశ్రకర్మ చేసినవారు మానవ శరీరములను పొందుతారని శాస్త్ర ప్రమాణము. శరీరం దుఃఖాలయం గనుక కర్మాచరణం వలన దుఃఖాన్ని పొందే వీరందరూ బద్ధులే. దుఃఖాన్నిచ్చే శరీరం కర్మ వలన కలిగింది. మరి ఈ కర్మకు కారణమేమి?

### రాగద్వేషములే కర్మకు కారణము

ఏది లేనందువలన మనకు బాధకలుగుతుందో అది రాగము. ఏది ఉన్నందున మనకు బాధ ఏర్పడుతుందో అది ద్వేషము. మానవ జీవితం రాగద్వేషాలతో పెనవేసుకొని యున్నది. ఈ రాగద్వేషాల వల్లనే కర్మాచరణ, తీరని దుఃఖం కలుగుతున్నాయి. అయితే రాగద్వేషాలకు కారణమేమిటి?

## అభిమానమే రాగద్వేషాలకు కారణము

అభిమాన అహంకారాలే రాగద్వేషాలకు కారణము. నేను, నాది యనెడి అభిమాన అహంకారాలే రాగద్వేషాలకు కారణము. కొన్నివేల శస్త్రచికిత్సలు చేసి శస్త్రచికిత్సలో నిపుణుడైన ఒక గొప్ప వైద్యుడు మన్ననలు పొందినను, తన బిడ్డకు శస్త్రచికిత్స చేయవలసివచ్చినపుడు-- - "గాండీవం సంస్రతే హస్తాత్" గాండీవం చేతి నుండి పడిపోవుచున్నదని అర్జునుడు చెప్పినట్లు మరొక వైద్యుని పిలిపించి చికిత్స జరిపిస్తాడు. కారణం? అభిమానం. నేను, నాది అనే అహంకారం. అభిమాన అహంకారాలకు కారణమేమిటి?

## అజ్ఞానమే అభిమాన అహంకారాలకు కారణము

"అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః" అజ్ఞానము చేత చుట్టబడినవారై జీవులు మోహము నొందుచున్నారని శ్రీ కృష్ణపరమాత్మ భగవద్గీత 5వ అధ్యాయంలో వివరించారు. జీవుడు జ్ఞాన స్వరూపుడు. సృష్టి నియంత. అజ్ఞానావృతుడైన జీవుడు తన స్వస్థితిని, స్వరూపమును మరచి, తన హృదయ మందిరములో స్వప్రకాశమై వెలుగొందే ఆత్మదర్శనాన్ని విడచి, అజ్ఞానం దారిచూపుతుంటే, రాగ ద్వేషాలనే గుఱ్ఱములను కర్మయనెడి వగ్గముతో నడిపిస్తూ దుఃఖమనే రథములో ఆసీనుడై జీవతమనెడి కంటకారణ్యములో ప్రవేశిస్తున్నాడు.

నీవు వెదికే ఆనందం నీలోనే వున్నది. అది అన్వేషిస్తే అంతు పట్టేదికాదు. ఆలకిస్తే తెలిసేది. జ్ఞానము నార్జించు. మెడలోనున్న నగ పోయిందనుకున్నావు. వెతికి వెతికి విసుగుచెందావు. నగ అసలు పోనే లేదు. అది మెడలోనే యున్నది. ఇప్పుడు నీవు చేయటం వెతకడం కాదు. వున్నదానినే తెలుసుకోవడం-పొందడం. "ప్రాప్తస్య ప్రాప్తిః", అది కేవలం జ్ఞానానికి సంబంధించిన విషయం. జ్ఞానము మరొకరి దగ్గర నుండి పొందాలి. జ్ఞానము నందించువాడు గురు వాక్కుడే.

– తమసోమా జ్యోతిర్గమయ –

# కర్మయోగ సందేశం

ఉన్న స్థితినుండి ఉన్నత స్థితికి చేరుకోవాలనే ప్రయత్నమే ప్రతిప్రాణి చేయు కర్మల వెనుక దాగియున్న ఆశయం. తనను బంధించిన పంజర కుడ్యాన్ని ఛేధించి స్వేచ్ఛను పొందాలనే చిలుక మనసులోని ఆంతర్యమే ప్రతిజీవి కర్మవెనుక దాగియున్న ప్రేరణగా తెలుస్తున్నది. నీటిలో చరిస్తున్న చేప ఆ ఆశయంతోనే ఎగరడం నేర్చుకుంది. ఎగిరి ఎగిరిఆశయసిద్ధి కైచేపగా తన స్థితిని కోల్పోయి పక్షి అయింది. నీలాకాశంలో సంచరించే పక్షి తిరిగి తిరిగి అలసి ఇక తిరుగలేక బలహీనమైన తన శరీరాన్ని వీడి బలిష్ఠమైన జంతువుగా మారింది. బుద్ధికుశలతలేని జంతువు ప్రకృతిలో పరిభ్రమించి, మూగబోయిన తన బ్రతుకును సవరించుకొని విజ్ఞానంతో జీవించాలని మనిషయింది.

వివేకవంతుడైన మానవుడు ముక్తపురుషుడు కావాలని, తాను అనుభవిస్తున్న దుఃఖమయ జీవనాన్ని సమాధి చేయాలని పరితపిస్తున్నాడు.

"నహికశ్చి త్క్షణ మపి జాతు తిష్ఠత్య కర్మకృత్" ఏవ్యక్తి కర్మ చేయక క్షణమైనను జీవించలేడు. కర్మసన్యాస మనునది ఆచరణ యోగ్యం కాదు. కర్మయోగమునందు స్థిరపడినవాడే కర్మసన్యాసి కాగలడు.

ఆసక్తితో మనమొక కర్మ నాచరించినపుడు ఆ కర్మద్వారా మనం పొందిన అనుభవం మనసులో సూక్ష్మాతి సూక్ష్మమైన ముద్రను వేస్తుంది. ఈ ముద్రలనే వేదాంత పరిభాషలో "వాసనలు" అంటారు. మనలోవున్న వాసనల ననుసరించే కోరికలు జనిస్తుంటాయి. ఆ కోరికలే మనసులో సంకల్పాల రూపంలో నడచి శరీరం ద్వారా కర్మలుగా వ్యక్తమౌతాయి. వాసనలు ఉన్నతంగా వుంటే మనసులో సత్సంకల్పా లుదయించి సత్కర్మ లాచరించే స్థితి కలుగుతుంది. వాసనలు నీచంగా వుంటే మనసులో క్షుద్రభావాలు కలిగి అమానుష కృత్యాలు ఆచరణలో కనుపిస్తాయి.

మనసులో సూక్ష్మరూపంలో వున్న వాసనలే కర్మల రూపంలో కనిపిస్తున్నప్పుడు భావాన్ని మార్చుకొని కర్మలను సవరించుకోవాలి. కర్మలలో మంచి చెడులు లేవు. కర్మలాచరించే వ్యక్తి భావనను బట్టి కర్మలు మంచి చెడులుగా మారుతుంటాయి. కత్తితో శస్త్రచికిత్స చేసిన వైద్యునికి. హత్యగావించిన హంతకునికి చాలా భేదం వుంది. స్వార్థంతో ఒకరిని చంపితే హంతకుడని నిర్ణయించి శిక్షిస్తున్నారు. యుద్ధభూమిలో కొన్ని వందలమందిని చంపిన సేనాధిపతిని "అభినవ అర్జున" అని కీర్తిస్తున్నాము; కర్మమంచిదా? కాదా? అనేది సమస్యకాదు. ఏ భావంతో చేస్తున్నాడనేది కావాలి. సత్కర్మలాచరించడము కాదు మనకు కావలసింది. సద్భావన కలిగియుండటం. మనం సద్భావన కలిగియుంటే మనం చేసే ప్రతికర్మ సత్కర్మగా మారిపోతుంది. నికృష్టమైన పూజావిధానంతో ఉత్కృష్టమైన మోక్షాన్ని సాధించిన భక్త శిఖామణి కన్నప్ప నాయనారే ఇందుకు నిదర్శనం.

కనుక మనలోని వాసనలను క్షాళనం చేయాలి. వాసనలు క్షాళనం కావాలంటే మనం ఆసక్తి లేకుండా కర్మల నాచరింప గలగాలి. కర్మ ఫలితాన్ని భగవత్ప్రసాదంగా భావించాలి. సుఖదుఃఖాలయందు సమస్థితి కలిగియుండాలి. యజ్ఞభావంతో కర్మల నాచరించడం అలవరచుకోవాలి.

సృష్టికర్త ఆదియందు భూతజాలమును సృష్టించినపుడే యజ్ఞమును కూడా సృష్టించి, ఈ యజ్ఞమే జీవులకు కామధేనువని తెలియజేసాడు. నేను, నాదియను అహంకార మమకారములను వీడి పదుగురికై జీవించే హృదయాన్ని కలిగియుండుటే యజ్ఞ భావన అనిపించుకొంటుంది. సృష్టిలో ప్రకృతియంతయూ ఈ యజ్ఞభావనకే కట్టుబడి నడుస్తున్నది. మానవుడొక్కడే దారితప్పి నడకసాగిస్తున్నాడు. త్యాగమే సృష్టిలో నడుస్తున్న ధర్మము. సృష్టిని నడుపుతున్న చట్టము. దానిని వ్యతిరేకించిన వానికి మనుగడలేదు. వాని మనసుకు శాంతి లభించదు.

కనుక యజ్ఞభావం అలవరచుకొని శుభవాసనలు కలిగి శుద్ధ సంకల్పాల ద్వారా సత్కర్మలాచరించాలి. తనకున్న దానిని ఇతరులతో పంచుకొని



జీవించాలి. విరాట్పురుషుని శరీరంలో ప్రతిజీవి ఒక అంగమనే భావన కలగాలి. అలాంటి జీవితమే పావనము, శోభనము. అట్టి జీవితాన్ని గడిపి గృహస్థాశ్రమంలోనే ముక్త పురుషులైన జనక, అంబరీష, ప్రహ్లాద, అశ్వపతి మొదలగు వారు కూడాను తమకు అవసరం లేకపోయిననూ లోకసంగ్రహార్థం కర్మల నాచరించారు. కనుక కర్మలను సన్యసించడము గాక కర్మయోగివిగానే జీవితాన్ని నడిపి చరితార్థుడవు గమ్మని భగవద్గీత 3వ అధ్యాయం-కర్మయోగం ద్వారా శ్రీ భగవానువాచ.

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బంధనః
తదర్థం కర్మకౌన్తేయ ముక్త సఙ్గసమాచర. (3అ, 9శ్లో)

కౌన్తేయా! మనుజుడు యజ్ఞకర్మగాక ఇతరములగు కర్మలచే సంసారమందు బంధింపబడును. యజ్ఞార్థమగు కర్మ మోక్షప్రాప్తి హేతువు. కనుక నీ కర్మలన్నియు ఆసక్తిలేక నిర్వహింపుము.

దృష్టి సరిచేసుకొని సద్భావంతో జీవించాలి. సృష్టిలోని ప్రతి రూపమూ భగవంతుని రూపంలా గనాలి. ప్రతిశబ్దమూ ప్రణవనాదంగా వినాలి. షేక్స్పియర్ ఊహాపథంలో --

**Tongues in trees**
**Books in running brooks**
**Sermons in stones**
**And good in everything**

– సర్వేజనా సుఖినో భవంతు –



# ధ్యానయోగ సందేశం

ప్రపంచము దృశ్యము. పరమాత్మ అదృశ్యము. మనం ప్రపంచాన్ని చూస్తున్నాము.పరమాత్మను నమ్ముతున్నాము. ఆద్యంతములు కలది గాన ప్రపంచము మిథ్య. త్రికాలము లందున్నందున పరమాత్మ సత్యము.

ప్రపంచము ఉన్నదున్నట్లు కనిపించదు; వినిపించదు; అనిపించదు. చూసే వ్యక్తి యొక్క మనస్సుపై ఆధారపడియుంటుంది. మనసు లేకపోతే మనుగడ పశుతుల్యం. మనస్సు కలిగిన బ్రతుకుకు శాంతి శూన్యం. మనస్సు గలవాడే మానవుడు. కనుకనే మనస్సు ననుసరించిన మానవుడు ఆవేదనలతో, ఆందోళనలతో, అలజడులతో, ఆవేశాలతో శాంతికి దూరమై తన బ్రతుకుకు తానే చితి పేర్చుకుంటున్నాడు.

జగత్తును కల్పించినది, జగత్తును చూచేవాని దృష్టిని కలవరపరచింది మనసే. ప్రకృతి నందలి శక్తి అంతయు మనోశక్తి కన్నా వేరు కాదు. బాహ్య ప్రపంచముతో మానవుని ముడిపెట్టింది మనసే. జగత్తులోని వ్యక్తులను, విషయములను స్మరించినంతవరకు మనస్సు చలామణి యగుచున్నది. అద్దములో వస్తువు ప్రతిబింబించులాగున మనోదర్పణములో ప్రపంచము భాసించుచున్నది. దర్పణము దూరము కాగానే ప్రతిబింబము వస్తువులో ఐక్యమగులాగున మనస్సు ఆత్మలో లయించగనే జగత్తు మటుమాయమగుచున్నది. బహిర్ముఖమవుతున్న మనస్సును అంతరంగికంగా మరలించి, ఆత్మవైపుకు త్రిప్పగానే, సూర్యునిముందు మంచుగడ్డ కరిగిపోవులాగున మనస్సు ఆత్మయందు లీనమగుచున్నది. బంధము పటాపంచలైనది. మోక్షము కరతలామలకము. అట్టి ప్రయత్నము చేయువాడే ధ్యానయోగి. ధ్యానయోగి జీవితమే ధన్యజీవితము.

"సంకల్పో బంధః నిస్సంకల్పో ముక్తిః" సంకల్ప వికల్పాల యందు ధ్యానయోగి జాగరూకుడై మెలగవలెను. సైనికుడు రహస్య ప్రదేశమునందు దాగి, ఆ మార్గమునకు వచ్చు శత్రువులను చంపుతూ తాను భద్రతలోనే యుండులాగున, ధ్యానయోగి సదా ఆత్మస్థితుడై, మనోఫలకముపై విజృంభించు కామక్రోధాది శత్రువులను విచారణ ఖడ్గముచే ఖండించి, మరల ఆత్మయందే దృష్టి నుంచ వలెను.

శాంతిని భగ్నంచేసినది మనస్సని గ్రహించినపుడు శాంతికాముకులమనుకొన్న ప్రతి ఒక్కరు యుద్ధము ప్రకటించవలసినది మనసుతోనే గాని, దేశాలతో కాదు. రాజులతో అంతకన్నా కాదు.

గాఢ నిద్రలో మనకు ఆలోచనలు లేవు. బంధాలు లేవు. నిద్రలో ఖైదీకి సంకెళ్ళు లేవు. గ్రుడ్డివానికి అంధత్వం లేదు.రాజుకు సింహాసనము లేదు. నిద్ర నుండి లేవగనే, మనసు జాగృతికి రాగానే ప్రతి వొక్కరు బద్ధులౌతున్నారు. సమస్యంతా మనసులోనేయున్నది. సమస్య మనసుకు సంబంధించినది గనుక పరిష్కారము కూడా మనోవశమే. సమస్యను కల్పించి, కన్నీటికి గురిచేయడంచేత మనసు మనకు శత్రువు. పరిష్కారము చూపించి హృదయంలో పన్నీటి జల్లులు కురిపించుట వలన మనసు మనకు మిత్రుడు. బంధ మోక్షములకు మనసే కారణము.

మనోజయమునకు మనము అనుసరించవలసిన మార్గములు :

## 1. ఆలోచనా విధానము

మనస్సు నుండి బయలుదేరు సంకల్పాలు ఋజుమార్గంలో ఉండులాగున చూడవలెను. సద్గ్రంథ పఠనము, మహాత్ముల జీవిత చరిత్రలను చదువుట, సత్యము, ప్రేమ, దయ, శాంతి, బ్రహ్మచర్యాది సద్భావములను చింతించుటవలన, ఆచరించుట వలన సంకల్పాలను మార్పు చేయవలెను. ఇదియే భక్తియోగం.

## 2. ఆలోచనా వేగము

సంకల్పముల సంఖ్యను తగ్గించవలెను. ఆలోచనా ప్రవాహమును ఆపవలెను. గతాన్ని గూర్చిన ఆవేదన, భవిష్యత్తును గూర్చిన ఆందోళనను

దూరంచేసి, వర్తమానంలో ఆవేశం లేకుండా యజ్ఞ భావంతో జీవించవలయును. ఇదియే కర్మయోగము.

3. ఆలోచనా మార్గము

ప్రాపంచిక విషయములపై మోహమును కలిగించు ఆలోచనలు వచ్చినపుడు. విచారణతో వాటిని పరమాత్మ వైపుకు త్రిప్పవలెను. రెండు సంకల్పాల మధ్యనున్న నిశ్శబ్దమును, ప్రశాంతతను ఎక్కువ కాలం ఉండులాగున అభ్యాసము చేయవలెను. ఇదియే జ్ఞానయోగం.

భక్తి, కర్మ, జ్ఞాన యోగాల ద్వారా చిత్త వృత్తులను నిరోధించి, ధ్యాన మనస్కుడై, సుస్థిర శాంతిని పొంది జీవన్ముక్తుడవు కమ్మని భగవద్గీత 6వ అధ్యాయం–ధ్యానయోగం ద్వారా శ్రీ భగవానువాచ.

యో మాం పశ్యతి సర్వత్ర
సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి
స చ మే న ప్రణశ్యతి. (భ.గీ. అ 6. శ్లో 30)

ఎవడు సమస్త భూతములను నా యందును, సర్వభూతముల యందు నన్నును జూచునో అట్టి బ్రహ్మాత్మైక్యసంధానము గలవానికి నేను పరోక్షముగా నుండను. అట్టివాడు నాకు పరోక్షముగా నుండడు.

ఓం తత్ సత్



# నేనెవరు ?

మనకు వినోద విషాదాలను పంచిపెట్టే ఈ ప్రపంచం చాలా విచిత్రమైనది. ఈ లోకంలో స్థిరమైన వస్తువు లేదు. పుట్టిన వస్తువు పెరుగుచున్నది. పెరిగిన వస్తువు కాలక్రమేణా తిరిగి క్రుళ్ళుచున్నది. క్రుళ్ళిన వస్తువు కృశించి నశించుచున్నది. సిద్ధాంతములు రాద్ధాంతములై పండుటాకులవలె రాలిపోవుచున్నవి. నిర్మించుకున్న ఆశాసౌధాలు పేకమేడలై కూలిపోతున్నవి. లోకములు ఆవిర్భవించి అంతరించుచున్నవి. కాలగర్భంలో కరగని వస్తువే లేదు. కాలరూప సుడిగాలిని తట్టుకొని నిలిచే శక్తి నామరూపాత్మకమైన ఈ జగత్తులో ఏ ప్రాణికీ లేదు. ఏ వస్తువుకు రాదు.

కదిలే బొమ్మలకు కదలని తెర ఆధారమైనట్లు, పొంగే తరంగములకు సాగర మాధారమైనట్లు చలనాత్మకమై, పరిణామశీలమైన ఈ ప్రపంచానికి ఆధార మొకటుండాలి. ఏమిటది? అదే! "నేను".

"నేను" ఎవరో మనకు తెలియడం లేదు. "నేను" తెలిస్తే నాదంటూ ఏదీ మిగలదు. "నేను" ఒడిలో దుఃఖం నిద్రపోతుంది. "నేనే" సుఖం, ఆనందం; అనంతం. ఈ "నేను" అంటే ఏమిటో తెలుసుకోవాలనే జిజ్ఞాస కలిగిన ముముక్షువు ప్రసన్నవదనుడైన ఒక సద్గురువు నాశ్రయించాడు.

శిష్యుడు :– స్వామీ! ప్రణామములు. ఏది గ్రహిస్తే మరొకటి గ్రహించాలనిపించదో, ఏది తెలిసిన మరొకటి తెలుసుకోవాలనిపించదో, దేని జ్ఞానముచేత అజ్ఞానము పటాపంచలై అంధకారం అంతమగునో అట్టి పరిపూర్ణ జ్ఞానాన్ని తెలుసుకోవాలని వుంది. కారుణ్యమూర్తీ! అనుగ్రహింపుడు.

గురువు :– నాయనా! అలా తెలుసుకోవాలని పరితపించే వాడెవడు?

శి :– నేనే స్వామీ.

గు :– ఆ "నేను" ఏమిటోతెలియునా?

శి :– "నేను" అంటే నేనే స్వామి.

గు :– అది సరైన సమాధానము కాదు. "నేను" అంటే ఏమిటో నిర్వచించాలి.

శి :– నేను రామయ్యగారి కుమారుడనండి.

గు :– నీ సమాధానం చాలా విడ్డూరంగా వుంది. ఇతరులతో నీ సంబంధాన్ని గుర్తుతెచ్చుకుంటూ "నేను" ను నిర్వచించాలనుకుంటున్నావు. నీవు రామయ్యకుమారుడివేకాదు. సుబ్బారావుతమ్ముడివి. కృష్ణారావు అన్నవి. సుజనకు తండ్రివి. విమలకు తాతవి. "నేను" ఎందరో వ్యక్తులతో, ఎన్నో విషయాలతో సంబంధం కలిగియున్నది. సంబంధ బాంధవ్యాలు దూరమైనా "నేను" నాకు దూరంకాదు. కనుక నీవెవడు?

శి :– నేను రమణారావు. డాక్టరు చదివాను. నన్ను డాక్టరు రమణారావు అంటారు.

గు:– నీవు నిజంగా డాక్టరు రమణారావు అయితే నీవు పుట్టగానే డాక్టరురమణారావు పుట్టాడని ఎవరైనా అన్నారా? లేదు. నీవు అయోమయంగా, అమాయకంగా ఒక కేకతో జన్మించావు. నిన్ను ఇతరులు గుర్తించటానికి పేరుపెట్టుకున్నావు. అనుభవాలు గడించావు. డాక్టరు వయ్యావు.కనుక "నేను" ఇవేవీ కాదు. బాగా ఆలోచించి సమాధానం చెప్పాలి.నీవెవరు?

శి :– గురూజీ! చెబుతున్నాను. నేను శరీరాన్ని. అందుకే ఇలా రమ్మంటే శరీరము వస్తున్నది. కూర్చోమంటే శరీరము కూర్చుంటున్నది. "స్థూలోహం– కృశోహం" నేను బొద్దుగా యున్నాను. నేను సన్నగా వున్నాను. ఇవన్నీ కూడా నేను శరీరమునే అని తెలియచేస్తున్నవి.

గు :– చాలా పొరపాటు నాయనా! నీవు శరీరానివికాదు. పాంచ భౌతికమైన శరీరం పరిణామం చెందుతున్నది. శరీరాన్ని గుర్తించే "నేను" అలా మారడంలేదు. "ఘటద్రష్టా ఘటాద్భిన్నః దేహద్రష్ట దేహోద్భిన్నః"



కుండను చూచేవాడు కుండకన్నా వేరు, శరీరాన్ని చూచే నేను శరీరం కన్నా వేరుగా యున్నాను. "ఇది నా చొక్కా" "నాపెన" అంటే నేను చొక్కాను కాను. పెనాను కాను. అలాగే "నాకాలు" నాచేయి" "నా శరీరమంటే" "నేను" అనేవీ కాదు. వానిని ధరించిన వాడినని అర్థం. నా కాలు పోయినంత మాత్రాన నేను పోను. నాచేయి విరిగినంత మాత్రాన "నేను" శిథిలం కావడంలేదు. కనుక "నేను" అనేది శరీరం కాదు.

శి:– బాగుంది స్వామీ! ఇప్పుడు తెలిసింది. నేనంటే మనస్సుని. అందుచేతనే "నేను బాధపడుతున్నాను." "నేను ఆలోచిస్తున్నాను" అని ప్రతివ్యక్తి చెబుతుంటాడు.

గు:– తప్పు ....తప్పు. ఆ వ్యక్తే "నా మనసు బాగుండలేదు" "నా మనస్సు కలవర పడుచున్నది" అనడం కూడా జరుగుచునే యున్నది. "నా మనస్సు" అన్నప్పుడే "నేను" వేరు, నేను పొందియున్న "నా మనసు" వేరు. అదియునుగాక నీ గాఢనిద్రలో మనసు పనిచేయడం లేదు. ఇది ప్రతిఒక్కరి స్వానుభవం. గాఢనిద్రలో సుఖదుఃఖాలకు తావులేదు. భావనలకు వీలులేదు. అయినా నీవున్నావు. మనసు లేనంతమాత్రాన "నేను" పోవడం లేదు. శారీరక మనో బుద్ధులు "నేను" ఉండుట వలన పనిచేయుచున్నవి. కనుక శారీరక సంబంధిత శీతోష్ణములుగాని, బుద్ధికి సంబంధించిన మానావమానములు గాని నన్ను చేరలేవు. "నేను" అన్నిటికీ అతీతమైనది. అదియే సర్వం. ఆత్మ తెలియగానే సమస్తం తెలియబడుతుంది.

శి:– ధన్యుడను స్వామీ ! మీ కృపా కటాక్షము వలన సత్యము ఎరుక పడినది. "నేను" నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వరూపుడను.

గు:– వత్సా! నా ద్వారా ఇపుడు నీవు పొందిన పరోక్షజ్ఞానమును మనన నిధి ధ్యాస ద్వారా ప్రత్యక్షానుభవముగా చేసికొనుము. మేఘమునందు వర్షమువలె, పాలలో వెన్నవలె, పుష్పము నందలి సౌరభమువలె ఈనామ రూపాత్మక ప్రపంచమునందు భగవంతుడు గుప్తమై, గుహ్యముగా అధిష్ఠానమైయున్నాడు.

---తత్త్వమసి ---

# జ్ఞాన వీచిక

మానవుడు జ్ఞానపిపాసి. ప్రకృతిని తన హస్త గతం చేసుకోవాలని, సృష్టినంతా తన హృదయంలో నింపుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. పరితపిస్తున్నాడు. తాను నిత్యుడుగా, పరిపూర్ణుడుగా ఉండాలని, ఆప్తకాముడు కావాలని ఊహిస్తున్నాడు. ఉత్సాహపడుతున్నాడు. అన్వేషణ పెరుగుతున్నదే గాని ఆనందం అంతుపట్టడంలేదు. బాధలు తీరడంలేదు. బరువులు తగ్గడంలేదు. కష్టాలు కరగడంలేదు. కన్నీళ్ళు ఆరడం లేదు.

మానవుడు పరిపూర్ణతకొరకు ఎందుకు ప్రయత్నిస్తున్నాడు? తనకు తెలియని, తన అనుభవంలో లేని విషయాన్ని ఎవ్వరూ ఆశించరు. అభిలషించరు. కనుక తాను పొందాలనుకున్న పరిపూర్ణత తన అనుభవ పరిధిలో నున్నదేకాని ఊహించి కల్పించుకున్న పేకమేడకాదు.

పరిపూర్ణత తన అనుభవంలో ఉన్నయెడల అది తన స్వభావమై, స్వరూపంగా ఉన్నది. తాను పొందేయున్న ఆనందాన్ని కావాలని ఎవరూ కాంక్షించరు. ప్రయత్న మనేది లేనిదానికొరకే గాని తనదై యున్న విషయానికికాదు. తన స్వరూపమైన ఆనందానికి కాదు.

అనుభవంలో లేకపోతే ప్రయత్నం సాగదు. మరి అనుభవంలో ఉన్నప్పుడు ప్రయత్నం అనవసరం. అసందర్భం. కనుక పరిపూర్ణత అనేది మానవుడవైన నీకు తెలుసా?

నాకు తెలుసు.........నాకు తెలియదు.

త్రాడులో పామును చూచినపుడు అది త్రాడు అని నాకు తెలియదు. అంత మాత్రాన త్రాడు నాకు తెలియనిదని, నా అనుభవంలో లేదని చెప్పుటకు వీలులేదు. త్రాడు నాకు తెలుసు. కానీ త్రాటిలో పామును చూడటం చేత, లేని పామును త్రాడులో కల్పించి ఆరోపించడం వలన నాకు త్రాడు తెలియడంలేదు.



ప్రతి ఒక్కరికి పరిపూర్ణత తెలుసు. జీవుడు పరిపూర్ణతలోనే యున్నాడు. మోక్షమనేది వెతికి సాధించేదికాదు. ఉన్నదానిని గ్రహించేది. తెలుసుకొనేది. ఇప్పుడు తత్త్వతః కావలసినది జ్ఞానము. జ్ఞానమును ప్రసాదించు కారుణ్యమూర్తి సద్గురువు. అందుకని–

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వ దర్శినః (4 అ–34 శ్లో)

సద్గురువు నాశ్రయించి, నమస్కరించి, సేవించి, అనుకూల సమయమందు ప్రశ్నించి, ఉపదేశమును పొందితరించమని శ్రీ భగవానువాచ.

– ఓం సద్గురుభ్యోనమః –

* * *

# అమృత జ్ఞాన కుసుమాలు

ఆదిలేని ఆనందమూర్తిని అర్చించాలని, అంతుతెలియని అమృత నాదంలో అణగిపోవాలని, అవధులులేని అనంత శిఖరాలలో అసమానులై అలరారాలని అందరూ ఆశిస్తుంటారు. ఆశయాలు ఎదిగి ఆచరణలో ఒదిగితే అనుభూతి కలుగుతుంది. అనుభూతిని పొందుటకు అనేక మార్గాలు. వానిలో అర్చన ఒక మార్గము. అర్చించే దెవరు? అర్చించున దెవరిని?

అర్చించువాడు పరిమితుడైన జీవుడు. అర్చింపబడే వాడు అనంతుడైన భగవానుడు. అర్చించుటకు జీవున కుపకరించు పరికరమేది? మనస్సు. మనస్సు పరిమితమా? అపరిమితమా? మనస్సు పరిమితమే. దేశకాలాదులకు, నామరూపాలకు అంకితమై జీవించే మనస్సు అపరిమితము కాదు. కాలేదు. అయితే పరిమితమైన మనస్సు అపరిమితమైన భగవానుని ఆరాధించ గలదా? అపరిపూర్ణమైన మనోవృత్తులు పరిపూర్ణుడైన భగవానుని చేరు మార్గమేమిటి? మనస్సు భగవానుని వద్దకు చేరలేదు. చేర్చలేదు. ఈశ్వర చైతన్యంలో మనస్సు లయించి పోవాలి. అదియే ఈశ్వర ప్రణిధానము. జీవ బ్రహ్మైక్య సంధానము.

జడమైన మనస్సు చైతన్యములో లయించవలెనన్నచో మనస్సు శుద్ధిచేయబడాలి. అట్టి శుద్ధిచేయు ప్రక్రియలే సాధనలు. పూజ, జప, ధ్యాన యోగాదులు.

"పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః"

"పూజ యందలి అనురాగమే భక్తి" యని వ్యాస భగవానులు అభిప్రాయపడినట్లు నారదమహర్షి భక్తి సూత్రాలలో తెలియజేసి యున్నారు. పూజ చేయునపుడు మనము సంపెంగ, గులాబి, మల్లె, మాలతీలాంటి పుష్పాలను భగవత్ప్రీతికరంగా సమర్పిస్తుంటాము. సందేశాత్మక జీవనమును కొనసాగించుటచేతనే పుష్పములు పూజ కుపయోగపడుచున్నవి.



ప్రకృతిలో వెలిగే కుసుమానికి సమాజములో మెలిగే మానవునికి జీవనరీతిలో ఏదో సంబంధముంది. ప్రగతి సాధనలో ఏదో సమన్వయముంది. పరస్పరము భావశుద్ధితో పుణికి పుచ్చుకున్న శోభ వారి ఉనికిలో ప్రస్ఫుటంగ మెరుస్తుంది. మెరుస్తున్న జీవనశోభ నుండి అవగాహన అమృత వర్షిణియై కురుస్తుంది. కురిసిన అమృతముతో తడిచిన మది ఆనంద బిందువులను చిందించి హృదిని నింపుతుంది. నిండిన హృది అశాంతిని ఎండించి శాంతిని పండిస్తుంది.

మొక్కసారమే పుష్పము. మొక్క జననము, జీవనము, పుష్ప వికాసమునకే అయి యున్నది. మొక్కలోని సాత్త్వికాంశమే పుష్పము. సాత్త్విక పుష్పము సత్తా స్వరూపమై విత్తునందించి తిరిగి వృక్షమును ప్రసాదిస్తుంది.

మాతృత్వమునకు మారుపేరుగ గోచరించు పుష్పములు రెండు విధములుగా తెలియుచున్నవి. రంగుదట్టము–వాసనమట్టమై శోభించునవి మొదటి రకమునకు చెందినవి. ఇవి మోజుకొరకేగాని పూజకు కొరగావు. రెండవ రకమునకు చెందిన పుష్పములు రంగులో రాణించలేక పోయినా సువాసన కల్గి రంగని మెడనలంకరించి శోభించేవి. అవనిలో అణగి యున్న శుద్ధ సాత్త్విక శోభను అలుముకొని ఆనందముతో కులుకుతాయి.

వికసిత సౌరభ కుసుమాల విశిష్టత అనిర్వచనీయము. సాహితీ ప్రియులకు అవి సరస్వతీ రూపాలు. కవివరేణ్యులకు కమనీయ కథావస్తువులు. విలాసునికి వినోదభరితాలు. విజ్ఞాని మనో గగనంలో ప్రకాశించు సుజ్ఞాన తారకలు.

రోగులకు నిదాన ప్రధానములు. భోగులకు క్రీడా విలాసములు. త్యాగులకు జీవన సందేశములు. యోగులకు సాధన భూమికలు.

వికసిత సౌరభ కుసుమాలను భగవానునికి సమర్పిస్తూ పూజచేస్తుంటాము. ఇది బాహ్యసాధన ప్రక్రియ. సాధకుడు బాహ్యసాధనలోనే చరించ కూడదు. బాహ్యసాధన ప్రక్రియలో సౌరభ ఆంతరంగిక సాధనలో కదిలి తరించాలి. ఆంతరంగిక సాధన ప్రక్రియ ద్వారా సద్గుణ కుసుమాలను సమర్పించులాగున పుష్పాలను భగవానునికి సమర్పించాలి.

ప్రకృతిలో శోభించు వికసిత పుష్పాలు ప్రమోద భరితములు. వినోదచరితములు. అనూహ్య అతులితములు. ఆనంద మిళితములు.

మానవునిలో గోచరించు అపూర్వ సద్గుణపుష్పాలు వికాసయుతములు. విశాల దృక్పథములు. విజ్ఞాన సాధకములు. విశ్రాంతి బోధకములు.

పూజద్వారా ఆత్మానుభూతిని పొందవలయునని వాంఛించు సాధకుడు బాహ్యములో పూజ కుపకరించు స్థూలపుష్పములతో పాటు ఆంతర్య వనవాటికలో పుష్పించే అమృత జ్ఞాన పుష్పములను కూడా సమర్పించాలి. అపుడే సాధకుని సాధన ఆధ్యాత్మిక మలుపు తిరుగుతుంది. ఆంతర్యంలో జ్ఞాన పుష్పములు విరబూయుటకు అనుకూలముగ మనస్సు కల్పతరువువలె తయారు కావాలి. అట్టి వృక్ష మనోకల్పము నుండి విరబూసి పుష్పించేవే అహింసాది జ్ఞానపుష్పములు. అవియే భగవంతునికి ప్రీతికరమైనవి. మనస్సునే పుష్పముగా తయారుచేసి భగవానునికి సమర్పించమని ఆదిశంకరులు "శివానందలహరి"లో తెలియజేసియున్నారు.

గభీరే కాసారే విశతి విజనే ఘోర విపినే
విశాలే శైలేచ భ్రమతి కుసుమార్థం జడమతిః
సమర్ప్యైకం చేత స్సరసిజ ముమానాథ భవతే
సుఖేనావ స్థాతుం జన ఇహ నజానాతి కిమహో ॥

"హే గిరిజాపతీ! శివా! మూర్ఖత్వముచే మానవుడు నిన్ను అర్చించు పూల నిమిత్తము లోతైన తటాకములలో కాలుమోపు చున్నాడు. భయంకర నిర్జన వనవాటికలో సంచరించుచున్నాడు. గిరి చెరియల యందు, గుట్టల మీద తిరుగుచున్నాడు. ఆహాఁ! ఏమి విచిత్రము! మనస్సనెడి ఒక్క పుష్పమును నీకు సమర్పించి సుఖపడలేక పోతున్నాడు కదా?"

మనస్సును భగవానునికి సమర్పించుటయనగా మనస్సులో అహింసాది జ్ఞానపుష్పములు విరబూయునట్లు జీవించి, నిరంతరము అట్టి పుష్ప సౌరభముతో బ్రతుకును గుబాళింపుచేసుకొనుటయని భావము. ఇట్టి విజ్ఞాన ఆంతర్యకుసుమాలు అష్టవిధములు. పవిత్రమైన అష్టవిధ పుష్పములే విష్ణుదేవునకు ప్రీతి కరమైనవి.

అహింసా ప్రథమం పుష్పం
పుష్ప మింద్రియ నిగ్రహః
సర్వభూత దయా పుష్పం
క్షమా పుష్పం విశేషతః
శాంతి పుష్పం తపః పుష్పం
ధ్యాన పుష్పం తథై వచ
సత్య మష్టవిధం పుష్పం
విష్ణో ప్రీతికరం భవేత్ ॥

అహింస, ఇంద్రియ నిగ్రహము, సర్వభూతదయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానము, సత్యములను ఈ ఎనిమిది పుష్పములు భగవంతునికి ప్రీతికరమైనవి. ప్రకృతిలో లభించు పుష్పములను భగవంతునికి సమర్పించుటతోపాటు, వాడని, ఊడని అహింసాది పుష్పములు వ్యక్తి నిర్మితములై యున్నందున అవి భగవానునకు అత్యంత ప్రియమును గూర్చును. మోదమును కల్పించును. ప్రమోదము నొనగూర్చును. అష్టవిధ పుష్పములలో మొదటిదైన అహింసను గూర్చి చర్చింతుము.

1) అహింస :- భగవత్ప్రీతి నొనగూర్చు అష్టవిధ పుష్పములలో అహింస మొదటిది.

'అహింసా వాఙ్మనంకాయైః ప్రాణిమాత్రా ప్రపీడనం
స్మాత్మవత్సర్వభూతేషు కాయేన మనసాగిరా'

శరీర మనో వాక్కులతో ఏ ప్రాణినైనను బాధింపకుండుట అహింసయని స్థూల నిర్వచనము. "అహింసాపరమో ధర్మః" అని వేదమాత ప్రవచనము. ఆత్మధర్మమే

పరమధర్మము. ఆత్మానందము నొందుటకు అడ్డంకులులేని జీవనము గడుపుటయే అహింస యనబడుతుంది. హింసయనునది పశుస్వభావము. మానవునిలోని పాశవిక స్వభావమును పోగొట్టుటకు అహింసయను ధర్మము అవతరించినది. అహింస యనునది కేవలము హింసింప కుండుటయేగాక, అపరిమిత ప్రేమను అందించుటయని అర్థం చేసుకోవాలి. ఆంతర్యములో కదిలే ద్వేషమును ప్రేమద్వారా నిర్వీర్యం చేసి సమస్థితిలో జీవించే మానసిక వైఖరియే అహింస అనబడుతుంది.

అహింస నవలంబించువ్యక్తి భయరహితుడై యుండాలి. అభయమే అహింసకు నాంది. అహింసయనేది సిద్ధాంతము కాదు. సుగుణము. అహింస యనునది శక్తి వంతమైన ఆయుధము. ఆత్మానుభవము నొసంగు శక్తి అహింసకున్నది.

అసూయగలవాడు, అసమర్థుడు, అభిమానము గలవాడు, అభియోగములు మోపువాడు అహింసావాది కాలేడు. సమదర్శన జీవనమును గమ్యముగ భావించి జీవించువాడే అహింసా మార్గములో చరించగలడు.

"అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః"

అహింసా వ్రతుడైన యోగయుక్తుని సాన్నిధ్యములో సహజవైరములు సమసిపోవును.

హింస అహింస లనునవి సంబంధిత సత్యములు. వాటిని స్థూలముగ గాక సూక్ష్మముగ గ్రహించి నిర్ణయించాలి. చెట్టునుండి ఆకుకోసినా, పువ్వును గిల్లినా అది హింసయేనని కొందరి అభిప్రాయము. కూరగాయలను భుజించుటచే వాటిలోని జీవపదార్థములు నశించునని వారి వాదన. మొక్కకు ప్రాణముండుటచే పూలు కోయుటచేత హింస జరుగుచున్నదని వారి ఆవేదన. నిజమే. మొక్కలో ప్రాణమున్నది. ప్రతిచర్య, స్పందన మొక్కలలో గోచరించుచున్నవి. మొక్కలలో జీవమున్నది. ఆలోచన లేదు. కోరికలేదు. స్పందన మాత్రమే యున్నది. చెట్లకు అన్నమయ, ప్రాణమయ కోశాలేగాని మనోమయ విజ్ఞానమయ కోశాలు లేవు. చెట్టులోని పువ్వును గిల్లినా అది మళ్ళీ పుష్పిస్తుంది. ఆకును కోసినా మళ్ళీ చిగురిస్తుంది. ప్రాణుల పరిస్థితి అలాకాదు. నిష్క్రమించిన ప్రాణం మళ్ళీ తిరిగి వచ్చి ఆదేహములో నివసించేదుండదు. తుపాకితో పేల్చి చంపకపోయినా, రాయితో కొట్టడము కూడా నేరమే. మనిషిని చంప నవసరము లేదు. అతనిని దేహేంద్రియ మనో బుద్ధుల స్థాయిలో ఎక్కడ చిన్నగాయం చేసినా అది హింసే అవుతుంది. స్వార్థంతో గాయాన్ని చేసేది హింస. ప్రేమతో గాయాన్ని మాన్పేది అహింస.

హింస అహింసలనునవి భావనా ప్రేరితములై యున్నందున అవి మొదట మనస్సులో కదలి ఆ తరువాత చేష్టగా అగుపిస్తాయి. కనుక నిర్ణయాలను, ఉద్దేశ్యములను పరికించి పరిశీలించాలి. పరిశీలన పూర్తి అయిన పిదప అది హింసయో అహింసయో నిర్ణయించాలి. తల్లిదండ్రులు పిల్లలను మందలిస్తారు. కొడతారు. అది హింస అనబడుతుందా? తన బిడ్డపై యున్న అతివాత్సల్యంతో పొరుగింటి బిడ్డను శిక్షించడము అహింస అవుతుందా? విద్యార్థిని ఉపాధ్యాయుడు శిక్షించడము హింస అనగలమా? దోషిని నిర్దోషిగా చిత్రించేందుకు శ్రమించిన న్యాయవాదిని అహింసావాది అనగలమా?

కర్మ యనునది మంచీగాదు; చెడూగాదు. కర్మచేయువాని మనస్సులో కదిలే భావనలే కర్మలకు మంచి చెడులను కల్పిస్తాయి. హింస అహింసలను వానిని ఈవిధంగా అర్థం చేసుకోవాలి. వైద్యుడు రోగిని శస్త్ర చికిత్సకుగాను ఆపరేషన్ బల్లపై పరుండబెట్టి కత్తితో కోయగా రోగి మరణించినపుడు ఆ చర్య హింసయని, వైద్యుడు దోషియని ఎవ్వరు నిర్ణయించరు. అదే వైద్యుడు ఆ కత్తితోనే దారిని పోతున్న మనిషిని చంపినపుడు వైద్యుడు నిర్దోషియని ఎవ్వరూ అనరు. స్వార్థపరులై దారి తప్పిన కొందరు న్యాయవాదులు తప్ప.

మనోభిప్రాయాలు మలినం కాకుండా చూసుకోవడమే అహింస. మాలిన్యం లేని మనుగడను సాగించడమే అహింస. తన జీవన మెలాంటిదో ఇతరుల జీవనము అలాంటిదేనని గ్రహించి తదను గుణంగా జీవించడమే అహింస. అట్టి అవగాహన వలన తనను సమస్తములో దర్శించడమే నిజమైన అహింస.

కలిగిన ఆనందానుభవమే అహింసాయుత జీవన మందించిన అమృతఫలము. అమర సందేశము.

"ఉత్పన్నాత్మావ బోధస్య హ్యద్వేష్ట త్వదయో గుణాః
అయత్నతో భవన్త్యస్య నతు సాధన రూపిణః"

జ్ఞానియైన వానిలో అహింసాది ధర్మములు వాటంతటవే గోచరించును. వాటిని పొందనవసరము జ్ఞానికిలేదు అని సురేశ్వరాచార్యులు నైష్కర్మ్య సిద్ధి యందు తెలియ జేసిరి.

2) ఇంద్రియ నిగ్రహము :- రెండవ పుష్పము ఇంద్రియ నిగ్రహము. అహింసాది ధర్మములతో మనిషి జీవించి యోగయుక్తుడు కావాలి. భగవంతునిలో నివసించడమే యోగము. యోగజీవితమును గడిపిన వ్యక్తి యోగీశ్వరుడు కాగలడు. అంతర్ముఖుడై, ఆత్మచింతనము కలవాడే యోగియగును. అంతర్ముఖము కావలయుననన్నచో బహిర్ముఖమగు ఇంద్రియములు నిగ్రహించ బడాలి. అందుచేత ఇంద్రియ నిగ్రహము ద్వితీయ పుష్పముగ తెలియ జేయబడినది.

ఇంద్రియాతీత జ్ఞానమును పొందవలయునని ప్రయత్నించు ముముక్షువు ఇంద్రియ నిగ్రహమును కలిగియుండ వలెను. విషయ ప్రపంచానురక్తిని విడిచి సంతృప్తితో మనుగడను కొనసాగించ గలిగి యుండాలి. "విషయాన్ విషవత్యజ" ఇంద్రియ విషయములను విషము వలె భావించి విడిచి పెట్టమని అష్టావక్రగీతలో అష్టావక్రుడు జనకమహర్షికి తెలియజేసెను. యదార్థానికి విషయాలు విషముకన్నా ప్రమాద భరితములని గ్రహించాలి. ఒక గిన్నెలో విషమున్నది. ఆ విషపాత్రను మనము చూడటము జరిగినది. అంతమాత్రాన మన ప్రాణముపోదు. ఆ విషము మన దేహములో ప్రవేశించినపుడు మాత్రమే హాని చేయును. విషయములు అలాకాదు. దర్శిస్తే చాలు స్పృశించ నవసరము లేదు. సీతాదేవి మాయలేడిని దర్శించింది. అంతే దానిని ముట్టలేదు. ముట్టకపోయినా ఎదురు పడితే పట్టుకో గలిగేవి ఇంద్రియ విషయాలు. అదియును అవసరము లేదు. ఒక్కొక్కసారి దర్శించనవసరము కూడా లేదు. గతానుభూతులు మనస్సులోనే దర్శనమిచ్చి, విజృంభించి, మనిషిని కర్మరంగములోకి లాగుతాయి. ఆరంభములో అమృత తుల్యంగా గోచరించి అంత్యములో విషపూరితంగా మిగులుతాయి.

నిరర్థకమైన ఇంద్రియ విషయాల అయోమయస్థితిని తెలియజేసి, వానిని త్యజించమని భర్తృహరి తెలియజేయగా, సర్వేంద్రియములను భగవత్సేవయందే లగ్నమగునట్లు ఆశీర్వదించమని ఆదిశంకరులు కైలాసపతిని స్తుతించారు.

"మనస్తే పాదబ్జే నివసతు వచస్తోత్ర ఫణితౌ
కరశ్చా భ్యార్చాయాం స్మృతిరపి కథా కర్ణన విధౌ
తపధ్యానే బుద్ధిర్నయన యుగళం మూర్తివిభవే
పరగ్రంథాన్కైర్వా! పరమశివ! జానే పరమతః"

పరమేశ్వరా! నా మనస్సు నీ పాదపద్మములయందే సదా వసించుగాక;

కైలాసపతీ! నా వాక్కు నీనామ స్మరణయందే రమించుగాక;

గిరిజారమణా! నా కరములు సదా నీ పూజలో నిమగ్నమగుకాక;

విశ్వనాథా! నా వీనులు సదా నీ సత్కథలను శ్రవణము చేయుగాక;

సాంబశివా! నా బుద్ధి తపోధ్యానాలలో తపించుగాక;

నీలకంఠా! నానేత్రములు నిరంతరము నీ దివ్యరూపమునే గాంచుగాక;

గంగాధరా! ఇట్టి జ్ఞాన గంగను సదా నీవు నాపై వర్షింపచేయగలిగినచో

అన్య గ్రంథముల నన్వేషించు అవసరము నాకెందులకు?

శంకరులు సూచించిన బాటలో చరించి ఇంద్రియాలను నిర్వీర్యం చేయాలి. భగవదారాధనలో ఇంద్రియాలను అంతర్ముఖం చేయాలి.

"ఓ నేత్రములారా! నశించిపోవు ఈ జగద్రూపముల వైపు పరుగు లిడెదరేల? శ్యామసుందరుని దివ్యరూపముగాంచి తరించలేరా? ఓ జిహ్వా!

ఎన్నిరుచులు చూసినను అభిరుచి నశించినదా? శ్రీకృష్ణ కథాగాన మను అమృతమును ఒక్కసారి పానము చేసిచూడుము. ఓ హస్తములారా! అసంఖ్యాకమైన కర్మల నాచరించి మీరు పొందిన సుఖమేమున్నది? ఒక్కసారి నందనందనుని అర్చించి చూడుడు! ఓ మనసా! ఉన్మాదివలె విశ్వమంతా చరించి నీవు పొందిన ఊరట ఏమున్నది? వాసుదేవుని అనంత చైతన్యములో పవ్వళించి చూడు" అని తల్లి బిడ్డను బుజ్జగించినట్లు బుజ్జగించి ఇంద్రియ మనో బుద్ధులను ఋజు మార్గములో నడిపి ఇంద్రియాలను నిగ్రహించాలి.

3. సర్వభూతదయ :- సర్వభూతదయ యనునది మూడవ పుష్పము. దేహమనో వాక్కులచే సర్వులను ప్రేమించుట దయ యనెడి సుగుణము.

"అనుకంపా దయా సైవ ప్రోక్తా వేదారిత వేదిభిః"

దేహమనో వాక్కులచే సకల భూతములను తనవలె చూచుకొనుట "దయ" అనబడుతుంది. దయగల హృదయమే భగవన్నిలయమని ఆర్యోక్తి. మనస్సుగలవాడు ఆలోచన లందించును. హృదయము గలవాడు దయను చిందించును. హృదయము భగవంతుని మందిరము.

సర్వస్య చాహం హృది సన్నివిష్టః

నేను సమస్త ప్రాణులయొక్క హృదయము నందున్నవాడను అని భగవానుడు భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగమునందు తెలియజేసి యున్నాడు. దేహములో మధ్యన హృదయమున్నది. హృదయ మధ్యమున భగవానుడున్నాడు. "హృదయము" అను పదములో మధ్యనున్న రెండక్షరములు దయయై యున్నందున దయయే భగవత్స్వరూపమని గ్రహించాలి. అట్టి దయగల మానవుడు భగవానుని కళ్యాణ గుణములను హృదయమునందు ఆవిష్కరింప చేసుకొని యున్నాడనుటలో సందేహము లేదు.

మొదటి పుష్పమైన అహింస ఈ మూడవ పుష్పమైన సర్వభూతదయ పరస్పరాధీనమై యున్నవి. దయాపూరిత హృదయమే అహింసకు పునాది. అహింసాయుత జీవనమే దయకు నాంది. ఎవరి హృదయములో దయారసము నిండియుండినచో అట్టి పుణ్యపురుషుడు సర్వులలో నారాయణుని దర్శించుచు సేవచేయ నుపక్రమించును. విశ్వ కల్యాణములో వ్యక్తి కల్యాణము అంతర్లీనమని విశ్వసించును. అందరి అవసరములను తన అవసరములుగ గుర్తించును. అన్యుల బాధా నివారణయే తన బాధ్యతగా స్వీకరించును. తన కున్నదానిని ఇతరులతో పంచుకొనుటలో తృప్తి చెందును. కదిలే జలప్రవాహము కనుపించే ప్రతి నూతిని నింపుతూ, ప్రతి గోతిలో తన నీటిని దింపుతూ తన స్థాయికి సమానముగ పెంచి సంతృప్తితో తరలిపోవును. అలాగే సర్వభూత దయయనెడి పుష్పమును హృదయమున నలంకరించుకొనిన వ్యక్తి నిరంతరము దీనులను ఆదుకొనుట యందు, ఆర్తులను ఓదార్చుటయందు తన కాలమును వినియోగించును. కాలికి దెబ్బ తగలగా నోరు 'అమ్మా' అని విలపించును. కడుపులో నొప్పికలుగగానే నేత్రాలు కన్నీటిని కురిపించును. ఓ మానవా! నీ శరీరములోని అంగములను చూచి పాఠములు నేర్చుకోలేవా? పరుల దుఃఖమును పోగొట్టు వాడే మహాత్ముడు. పరుల కొరకు తన బ్రతుకును త్యాగము చేయువాడే మహితాత్ముడు. నీకు కాంతి నిచ్చే ప్రయత్నములో క్రొవ్వొత్తి తాను కరిగి పోవుటలేదా? నీకు వర్షాన్నందించే ఉత్సాహములో మేఘము తాను అదృశ్యమగుట లేదా? నిన్ను పునీత మొనర్చుటకు గంగామాత శంభుని వదలి క్రిందికి జారలేదా? నీవు మాత్రము మారలేవా? ప్రేమను చిందించి ప్రతి ప్రాణికి నీదయను అందించు. జన్మకు సార్థకతను గుర్తించు. మానవత్వ పరిధిలో జీవించు. అమృతత్వ జీవనములో ప్రవేశించు. పరిమళ భరితమైన సర్వభూతదయ యనెడి ఈ పవిత్ర తృతీయ కుసుమమును ఆఘ్రాణించుచు కైవల్యపదము నొంది తరించుము.

4) క్షమ :- 'క్షమ' యనునది నాల్గవ పుష్పము. సుగంధ భరితమై ప్రకాశించు ఈ క్షమాపుష్పము దైవగుణమని చెప్పదగును.

'తేజః క్షమాధృతి శ్శౌచ మద్రోహా నాతిమానితా'

భగవద్గీతలో దైవాసుర సంపద్విభాగ యోగ ప్రారంభములో దైవసంపత్తిని గూర్చి తెలియచేయుచు "క్షమ" ను కూడా భగవానుడు తెలియజేసెను. క్షమ

యనగా ఓర్పు లేక సహనము లేక కష్ట సహిష్ణుత. ఎన్ని బాధలెదురైనను, కష్టములు శరపరంపరవలె పైన బడినను చలించక, వ్యధచెందక జీవించు వాడే "క్షమీ" అను పదమునకు సరిపోవువాడు. అందుచేతనే సహనమునకు భూమాతను ప్రశంసింతురు. బరువుకు భూమి కృంగిపోదు. క్షమీ బాధలకు లొంగిపోడు.

'వృక్ష ఇవ తిష్ఠాసే చ్ఛిద్యమానో నకుప్యేత నకంప్యేత"

అని వేదమాత ప్రవచనము. తనను గాయపరచిన వానికి కూడా వృక్షములు ఫలముల నందించి తాము స్థిరముగ నిలబడి యుండును. అలాగే సహనశీలుడు తనను బాధలకు గురి చేయువానిని కూడా ప్రేమించి గౌరవించును. ఆదరించి ఆనందింప చేయును.

ఓర్పుయనునది అత్యుత్తమమైన దైవగుణము. ఇతరులకు తీర్పు నొసంగునపుడు అందరూ ఓర్పుగానే కనుపింతురు. తమ జీవితములోమార్పును ఇతరులు సూచించగానే ఓర్పు నశించును. తనకు ఓదార్పు గలిగేదే నిజమైన ఓర్పు. ద్వేషాగ్నిని ఆర్పు ఏకైక సాధనము ఓర్పు. అసూయా వ్యాధిని మాన్పు దివ్యౌషధము ఓర్పు.

ఇతరులు దూషించినను, హింసించినను చెదరక, కదలక జీవించు మనస్తత్త్వమే "క్షమ" అని శంకరాచార్యులవారు తన గీతా భాష్యములో తెలియజేసియున్నారు. బలహీనులగు వారు క్షమా గుణమును పొందలేరు. నిండుసభలో ద్రౌపదిని అవమాన పరచుటకు కౌరవులు యత్నించు సందర్భమున ఆమె భర్తలైన ఐదుగురు పాండవులు అక్కడే ఓర్పుతో నిలబడి యుండిరి. ఆ సన్నివేశమును చదువునపుడు అవగాహన లోపించిన మందమతులు పాండవులను బలహీనులుగ నిర్ణయింతురు. యథార్థానికి వారు బలహీనులు కారు. మహాబలాఢ్యులు. సహనశీలురు. ఆవేశమును ప్రకటించుటకు బలమవసరము లేదు. ప్రతి బలహీనుడు చేయుపని అదియే. పొంగివచ్చు ఆవేశమును ఆపుకొనుటకు మహత్తరమైన శక్తి కావలయును. సహనశీలురు, క్షమాగుణము కలవారే అట్టి దివ్యగుణమును ప్రదర్శించి చూపగలరు. తుపాకి గుండ్లు గుండె



లోకి దూసుకొనిపోయినపుడు కూడా తనను చంపిన వ్యక్తిపై బాపూజీ ప్రేమ దృక్కును ప్రసరింపచేసెను. ఇదియే క్షమ. సహన జీవనమే సమదర్శన వీక్షణము నందించగలదు.

'క్షమ' అను దివ్యగుణమును కలిగిన సాధకులు తమలో సహన సుహృద్భావములను పెంపొందించుకొనుటయేగాక ఇతరులలో కూడా దివ్యజీవన బీజములను నాటగలరు. ఆవేశము అనర్థ దాయకమని, అవగాహనతో కూడిన సహనమే ఆత్మానుభూతికి మార్గమని గ్రహించి, అట్టి దివ్య బాటలో సదా చరించి తరించాలి.

5) శాంతి :- శాంతి యనునది ఐదవ పుష్పము. శాంతి యనునది మానవుని సహజస్థితి. మానవుని స్వభావమే శాంతి. స్వరూపమే శాంతి. తన స్వరూపమైన శాంతిని పొందుటకు ప్రయత్నము లవసరము లేదు. అశాంతి కలుగడానికి కారణము లుండవచ్చును గాని శాంతిని పొందుటకు కారణము లవసరము లేదు. అశాంతికి గల కారణములను తొలగించగానే శాంతి తనంతతానే ప్రకాశిస్తుంది. అనారోగ్యమునకు గల కారణములను గుర్తించి, తత్కారణములను నివారించగనే తన నిజస్వరూపమైన ఆరోగ్యము అనుభవమునకు అందుతుంది. శాంతి కూడా అలాంటిదే. శాంతి యనునది దేహ ధర్మముకాదు. మనోధర్మముకాదు. ఇంద్రియధర్మమసలే కాదు. శాంతి యనునది కేవలము ఆత్మ ధర్మమే. కనుక శాంతిని కోరువాడు ఆత్మస్థితుడు కావాలి. ఆత్మవిదుడుగా మారాలి.

సదా శాంతిని కాంక్షించు మానవుడు తాను అభిలషించు శాంతి కొరకు బాహ్యములో ప్రయత్నములు చేయుచున్నాడు. వస్తు ప్రపంచము చుట్టు పరిభ్రమించి అవస్థల పాలగుచున్నాడు. శాంతి యనునది వస్తువులలో లేదు. ప్రపంచమునుండి రాదు. మృగతృష్ణలో నీటిని పానంచేసి దప్పిక తీర్చుకొన యత్నించు బాటసారి అవివేకి. వస్తు ప్రపంచ ఎండమావి నుండి శాంతి జలమును పొందగోరు మానవుడు అజ్ఞాని.

బాహ్యజగత్తుతో ప్రేమను పెంచుకొని, భోగభాగ్యాలలో చరించి విసుగుచెందిన అనేకమంది పాశ్చాత్యులు ఈనాడు సాధుపురుషుల సహచర్య భాగ్యమును కోరుచు మనదేశాని కరుదెంచుచున్నారు. ఎందుకని? దృశ్యమాన జగత్తులో కదులు కల్లోల తరంగాల భ్రాంతిమయ జీవనాన్ని వారు చక్కగా తిలకించారు. వస్తు ప్రపంచములోని నిస్సార జీవనమును వారు విమర్శనాత్మకంగా అర్థం చేసుకొన్నారు. వారు వాంఛించే శాంతి ప్రపంచములో అన్వేషిస్తే లభించేదికాదని, ఆంతర్యంలో అంతరేక్షణ ద్వారా సాధించేదని గ్రహించగలిగారు. సమస్తకోరికలను వీడి, దృశ్యమాన జగత్తుతో, వ్యక్తులతో ఏర్పరచుకున్న మిథ్యా సంబంధాన్ని విడనాడి "సర్వమిదమహం చ బ్రహ్మైవ" తనను, తాను వసించు ప్రపంచమును బ్రహ్మముగానే దర్శించ వలయును. అప్పుడే మనిషికి శాంతి లభించును. శాంతిలేని జీవి దుఃఖము ననుభవించును. 'అశాంతస్య కుత స్సుఖమ్' శాంతిలేని వానికి సుఖమెలా కలుగును? అని భగవానుడు స్థిత ప్రజ్ఞ వివరణలో తెలియజేసి యున్నాడు.

"యాగాది కర్మము లన్నియు చేసిన
భాగవతులనుచు బాగుగ పేరైన
శాంతములేక సౌఖ్యములేదు"

అని త్యాగరాజస్వామి గానం చేసియున్నారు. కనుక పరిమళ భరితమై ప్రశాంతతను వెదజల్లు ఈ నాల్గవ శాంతి పుష్పముతో భగవంతుని అర్చించువారు భగవానునకు ప్రీతి పాత్రులగుదురు.

6) తపస్సు :- తపస్సు యనునది ఆరవపుష్పము. తపస్సు యనగా తపించుట లేక తపింపచేయుట. తనను తాను తపింపచేసుకొన యత్నించువాడు ముందుగ ఇంద్రియ మనో బుద్ధులను తపింపచేయగలిగి యుండవలెను. బహిర్ముఖమై, అన్యాయంగా వస్తు ప్రపంచవలలో తగుల్కొని నిరర్థకమయ్యే ఇంద్రియ మనోబుద్ధులను అంతర్ముఖంచేసి ఆత్మయందు లయింప చేయుటయే తపస్సు అనబడుతుంది.



మనస్సులోని త్రిదోషములను పారద్రోలుటయే నిజమైన తపస్సు. మల, విక్షేప ఆవరణాదులే త్రిదోషములు. నిస్వార్థసేవద్వారా కర్మ యోగ ప్రక్రియలో సాధన సాగించి అంతఃకరణ శుద్ధిని పొంది మలమును తొలగించి నిర్మల జీవనమును సాగించవలెను. ఉపాసన, సంకీర్తనాదుల ద్వారా భక్తియోగ ప్రక్రియలో సాధన కొనసాగించి మనస్సులోని విక్షేపమును పారద్రోలి ప్రశాంతత ననుభవించవలెను. శ్రవణ, మనన నిధి ధ్యాసలద్వారా జ్ఞానయోగ ప్రక్రియలో అనుసంధానము చేసి బుద్ధిని స్థిరపరచుకొని, అజ్ఞానమనెడి ఆవరణను తొలగించి ఆత్మానందములో ఓలలాడాలి. ఇదంతయు తపస్సనే భావించాలి. విద్యలేని తపస్సు వింతగా మిగులుతుంది. అందుచేతనే

విద్యా తపోభ్యాం పూతాత్మా

అని శాస్త్రము హెచ్చరించింది. ఆధ్యాత్మిక ప్రగతి తపస్సు మీదనే ఆధారపడియున్నది. మోక్ష సామ్రాజ్య గుడి తలుపులు తీయుటకు తపస్సే తాళం చెవియై యున్నది. నిరంతర తపోభ్యాసముచే మనస్సులో ప్రశాంతత ఏర్పడును. ఇంద్రియ కల్లోలములు ఆగును. హృదయములో శాంతి నిండును. తపస్సు తీవ్రముగా సాగి మనస్సు ఊర్ధ్వ భూమికల నధిరోహించగానే కోరికలు నిర్వీర్యమగును. బాహ్యశబ్దములుకూడా ప్రవేశించలేని నిశ్శబ్ద ప్రశాంతతలో మనస్సు లయించి పోవును.

దుష్టసంకల్పాలకు అందక, వస్తువుల వ్యామోహ పరిధిలో చిక్కక భావాకాశంలో ఎగిరి అనంత శిఖరాలను మనస్సు అందుకొని ఆనందంలో నిండియుండుటయే తపస్సుయొక్క గమ్యము. తపస్వియైనవాడు జాగరూకుడై మెలగవలెను. తపమాచరించు సమయమున గతస్మృతులనే సైన్యమును వెంట నిడుకొని మనస్సు దండయాత్ర సల్పును. మనోప్రేరణను లెక్కచేయక తన లక్ష్యమునందే ఏకాగ్రతనుంచి తపము నాచరించ గలిగినచో మనస్సు నిర్వీర్యమై నిస్సారమగును. మనస్సును జయించిన వానిని ముక్తి కాంత వరించును.

7) ధ్యానము :– ధ్యానమనునది ఏడవ పుష్పము. ఇది బహు విశిష్టమైనది. ధ్యానము చేయునదెవరు? మనస్సు. "మనసైవాను ద్రష్టవ్యమ్" మనస్సు ద్వారానే దర్శించవలయునని శృతి ప్రమాణము. అయితే "యన్మనసా నమనుతే" యని కేనోపనిషత్తుద్వారా శృతియే తెలియ చేయుచున్నది. మనస్సు ఆత్మను దర్శించలేదు. మరి ఆత్మను దర్శించుటకు మనస్సుకన్నా మరియొక పరికరము అందుబాటులోలేదు. కనుక "ఆత్మ సంస్థం మనః కృత్వా" మనస్సును ఆత్మయందు నిలిపి అన్యమైనవానిని గురించి చింతించక ఉండుటయే ధ్యానమనబడుతుంది. అందుచేతనే "ధ్యానం నిర్విషయం మనః" మనస్సులోని వృత్తులను తొలగించుటయే ధ్యానమని సాధారణ నిర్వచనము చేయడము జరిగినది, "యోగః చిత్త వృత్తినిరోధః" చిత్త వృత్తులను నిరోధించుటయే యోగమని పతంజలిమహర్షి తన యోగదర్శనములో తెలియజేసియున్నాడు. ధ్యానముకూడా యోగమే. అందుచేతనే ధ్యానయోగము అందురు. "యోజ యతి" అనగా చేర్చునది. జీవుని బ్రహ్మముతో చేర్చునదిగాన ధ్యానము యోగమై యొప్పారుచున్నది. ఈ ధ్యాన యోగమునందు నిలిచినచో సమాధి లభించును.

"మనసో వృత్తి శూన్యస్య నిర్వికారాత్మ నా స్థితిః
అసం ప్రజ్ఞాత నామా సౌ సమాధి ర్యోగినాం ప్రియః"

మనస్సులో వృత్తులు నశించి, చిత్తము నిర్వికారమై యుండునట్టి ఏస్థితి గలదో అదియే అసంప్రజ్ఞాత సమాధియని గౌడపాదాచార్యులవారు తెలియజేసి యున్నారు. అట్టి స్థితిలో

"సమోదతే మోదనీయగ్ం హి లబ్ధ్వా"

"పొందదగిన దానిని పొంది అతడు తృప్తి చెందును" అని వేదము తెలియ చేయుచున్నది.

ఆత్మలాభా న్నపరం విద్యతే

ఆత్మలాభమునకు మించిన లాభము మరియొకటుండదని శృతి ప్రమాణము.



అతీంద్రియ జ్ఞానము ధ్యానముద్వారా లభించును. అంతర్య హృదయ గర్భగుడి చెంతకు ప్రవేశించి, హృదయగుడికి వేసియున్న అజ్ఞాన తలుపులను బ్రద్దలుచేసి, కోటి సూర్య సమప్రభావంతో దేదీప్యమానమై వెలుగు పరంధాముని దర్శించి తరించు స్థితి ధ్యానముద్వారా ప్రాప్తించును. ధ్యాన నావలో ఎక్కి ప్రయాణించు సాధకుడు మోక్షతీరమును చేరును.

మనము చర్చించు ఈ అష్టవిధ అమృత కుసుమములలో ధ్యానమునకు ఏడవస్థానము కల్పించబడినది. ధ్యానము ఏడవ పుష్పము. పతంజలి మహర్షి సూచించిన అష్టాంగయోగములో కూడా ఏడవది ధ్యానమై యున్నది. ధ్యానము తరువాత ఎనిమిదవ అంగముగా సమాధిని పతంజలి తెలియచేయగా, ప్రస్తుతము మనముచ్చరించు అష్టవిధ పుష్పములలో ఏడవదియైన ధ్యానము తరువాత ఎనిమిదవ పుష్పము సత్యమై యున్నది. సమాధిలో సత్యము గోచరించును గాన ఈ ఎనిమిదవ పుష్పమైన సత్యము పతంజలి మహర్షి యోగదర్శనములోని సమాధి అనుభవమే అయియున్నది.

8) సత్యము :– సత్యమనునది ఎనిమిదవ పుష్పము. సత్యమను పదమునకు రెండర్థములు గలవు. 1) సత్యము పలుకుట, 2) సత్యమై భాసించుట; అనగా సత్పదార్థ దర్శనము.

మొదటిది సత్యము పలుకుట. సత్యములో చరించుట, సత్యమునే ఆలోచించుట, త్రికరణ శుద్ధిగా జీవించుటయే సత్యమని, సంబంధిత సత్య నిర్వచనము. ఇది సమాజ జీవన ప్రగతి కుపకరించు జీవన సూత్రము. ఇలా సత్యము పలుకుటలో కూడా ధర్మాధర్మ విచక్షణ అవసరమైయున్నది. ఈ మీమాంసను ధర్మశాస్త్రములో మనువు తెలియజేసి యున్నాడు.

"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయత్
న బ్రూయాత్ సత్య మప్రియమ్, ప్రియంచ
నాఽనృతం బ్రూయాత్, ఏషధర్మ స్సనాతనః"

సత్యమునే పలుకుము. ప్రియముగా నుండునటుల సత్యమును పలుకుము. అప్రియముగా నుండు సత్యమును పలుకకుము. ప్రియముగా నున్నదని అసత్యమును పలుకవద్దు అని మను ధర్మశాస్త్రము.

ఇక రెండవది. సత్యమనగా త్రికాలములయందుండి కాలాతీతమై మనగలుగునది అని భావము. "యద్ అస్తి తత్సత్యం" ఏదయితే ఉన్నదో అదియే సత్యము. జగత్తు మిథ్యామనుగడను కలిగి యుండుటచే అది సత్యము కానేరదు. ప్రపంచ మనుగడకు ఆధారమై గోచరించు ఆత్మయే సత్యము.

ఏకమేవ అద్వితీయం బ్రహ్మోఽమృతం
అఖండ చిదానందాకారం నిరపేక్షం పరిపూర్ణమ్

"భగవంతుడు తప్ప రెండవ వస్తువు లేదు. అతడు అవినాశి. జ్ఞాన స్వరూపుడు. పరిపూర్ణుడు" అని అద్వైతామృతోపనిషత్తు తెలియచేయుచున్నది. తత్త్వమసి వాక్యార్థ విచారణద్వారా సత్యపదార్థమును అనుభవమునకు తెచ్చుకొని తరించాలి.

"తత్త్వమసి" వాక్యార్థ చింతనమేవ
అంతరంగ సాధనం ఆత్మ బోధస్య"

"తత్త్వమసి" మహావాక్యమును, తద్భావ చింతనములద్వారా ఆంతర్యములో సాధనచేసి ఆత్మానుభూతిని పొందవలయును" అని వేదాంత సారోపనిషత్ తెలియచేయుచున్నది. బ్రహ్మము సత్యస్వరూపము. సర్వమూ బ్రహ్మమయమే అని భావించి జీవించు సాధకుడు మోక్షపదవిని పొందును.

ముముక్షువులారా! అష్టవిధ అమృత జ్ఞానకుసుమాలను మీ ముందుంచడము జరిగినది. ఆచరణ యనెడి దారముతో ఈపుష్పములను మాలగా దీర్చి, అలంకరించుకొని శోభించండి.

ఎంతో చెప్పాలని వుంది. గ్రంథవిస్తరణ భీతి ప్రస్తుతానికి ఆగమన్నది. కాలమే భీతిని కల్గించింది. కనుక కాలమే దానిని దూరం చేస్తుంది. భీతి తొలగగానే నూతన రీతిలో మళ్ళీ ఈ వ్యాసమును మీ ముందుంచ గలను.

– ఓం తత్ సత్ –

# శిల్పం చెప్పిన సత్యం

ఏదీ లేనిచోట అంతా ఉంటుంది. శూన్యం కాగల్గితే పూర్ణం అవగతమవుతుంది. నిండిన మనస్సు పండదు. ఎండిన మనస్సు పండుగ గాకపోదు. "అహం" నిండితే ఇహపరాలు మిగలవు. "అహం" తొలగితే పరం ఇహంలోనే ఇముడుతుంది.

"అహం" అనర్థానికి నాంది పలుకుతుంది. అనుచిత ప్రలాపం ప్రస్తావనగా మారుతుంది. అసత్య దర్శనం కథావస్తువుగా తయారవుతుంది. అధర్మజీవనం ఇతి వృత్తంగా కదులుతుంది. అశాంతియే అంతిమ సందేశం అవుతుంది. దురవగాహన మొక్కనుండి కదిలిన "అహం" పుష్పములోని రాగద్వేషపరాగ రేణువులు అశాంతి ఫలాలుగా ఫలదీకరణ చెందుతాయి. అట్టి ఫలములు లోకాని కందించేది శోకమే. లోకమునుండి గ్రహించేదీ శోకమే.

"యస్మాన్నోద్విజతే లోకః లోకాన్నోద్విజతేచయః"

"ఎవని వలన లోకమునకు ఉద్వేగములేదో, లోకమువలన ఎవరికి విచారము ఉండదో అతడే భక్తుడు. సత్యదర్శనం చేయగల సమర్థుడు.

అది ప్రభాత సమయం. ఉజ్జ్వలకాంతి కిరణ ప్రసారముతో లోకాన్ని ఉత్తేజ పరచేందుకు ఉరకలేస్తున్నాడు ఉదయభానుడు. అరుణోదయ కాంతిపుంజములు కనుమరుగై నూతన వెలుగులు విరజిమ్మబడుతున్నాయి. స్నానాదులు ముగించుకొని పట్టువస్త్రధారియై కరమున కమలమును ధరించి కదిలివస్తున్నాడు నవయువకుడైన సత్యకీర్తి. ప్రకృతి పరిష్వంగనలో తాను ఏకీభూతమయ్యాడు. తాదాత్మ్యం చెందాడు. తద్రూపమయ్యాడు. తన్మయుడయ్యాడు. తత్పరుడయ్యాడు. విరజిమ్మబడు సూర్యకాంతిని చూశాడు. భానుని కిరణకాంతి అంతవరకున్న అంధకారమును అంతమొందించునట్లు, జ్ఞానప్రకాశము అజ్ఞానాంధకారమును పారద్రోలునని గ్రహించాడు. వృక్షజాలము

నుండి కదిలిన పక్షుల సమూహమును గాంచాడు. జ్ఞాన జాగరణలో అద్భుత కార్యములు కదలగలవని ఊహించాడు. అప్పటికి తన అడుగులు నదిని సమీపించాయి. నిర్మలంగా, అనాయాసంగా కదలిపోతున్న నదిని గాంచాడు. మాలిన్యమును పరిశుద్ధమొనర్చుచు, ప్రాణుల దప్పిక తీర్చుచు, పంట పొలాలను సస్యశ్యామలం చేయుచూ, ఏదీ ఆశించక ఆవేశంతో చరించక పవిత్ర నడకను సాగించు నదీమతల్లి జ్ఞాని జీవన నడకను ప్రతిబింబించు చున్నదని భావించాడు.

నదిని దాటాడు. గుడిగంట మ్రోగింది. ఆలోచనా పరంపరలలో కదులుతున్న సత్యకీర్తి తాను చేరదలచిన ఆలయాన్ని సమీపించినట్లు గుర్తించాడు. ఆలయంలో ప్రవేశించాడు. మూర్తిని దర్శించాడు. తన చేతిలోని పద్మమును మూర్తి పాదాలచెంత ఉంచాడు. అప్రయత్నంగా చేతులు జోడించాడు. అభయహస్తమును చూపుతున్న మూర్తిని దర్శించి నిర్భయుడయ్యాడు.

తన మనో గగనంలో ఆలోచనా విహంగాలు విహరించ సాగాయి. “ఆహా! ఈ మూర్తిలో ఎంతస్ఫూర్తి! ఈ మూర్తికి ఎక్కడ నుండి వచ్చినది ఇంతకీర్తి? ఎన్ని పూలమాలలు? ఎందరి వందనాలు? పట్టువస్త్రాలు, స్వర్ణాభరణాలు, అగరువత్తుల ఘుమఘుమలు; కర్పూర హారతుల వెలుగుల తోరణాలు–ఆలోచించసాగాడు సత్యకీర్తి. ఇంతలో మూర్తి నోరు విప్పింది. అలికిడి చేసింది. సత్యకీర్తి నిశ్చేష్టుడై మూర్తి వంక చూశాడు....“నా కథ చెప్పనా!” అన్నది మూర్తి సత్యకీర్తితో. “నీకూ ఒక కథ ఉన్నదా?” అని మనస్సులో భావించాడు సత్యకీర్తి. చెప్పమన్నట్లు తల ఊపాడు.

మూర్తి ముఖస్ఫూర్తిలో మార్పు గోచరించింది. స్మృతి పుటలను త్రిప్పుతున్నట్లు అనిపించింది. కొంతసేపు నిశ్శబ్దం–ఆ తర్వాత ప్రశాంతంగా మూర్తి ప్రవచించసాగింది.

“ఆదిలో నేను అవనిలో భాగమై ఉండేదానిని. భూమాత ఒడిలో పరుండియున్న నాకు భూభారం తెలిసేదికాదు. ప్రశాంతంగా జీవితము



సాగించేదాన్ని. ఒకనాడు నా ఆహ్వానం లేకనే ఒక వ్యక్తి నన్ను సమీపించాడు. గునపమును చేబూని వచ్చాడు. నా గుండెను తొలచసాగాడు. నోరులేని నా నుండి అరుపులు వినిపించేలా కొట్టాడు. నా శరీరం శిథిలమైంది. ఒళ్ళంతా గుల్లబారింది. భూమాత ఒడిలో నిద్రించు నన్ను లేపి భూమిపై పడవేశాడు.

ప్రకృతిశోభ నాకంటబడింది. సంతోషించాను. గునపముతో కొట్టినా ప్రకృతి యశస్సును గాంచు భాగ్యమును కల్పించాడని తృప్తి పడ్డాను. ఆలోచించినంతకాలము పట్టలేదు, ఆనందం భగ్నంకావడానికి. ఒక శకటాన్ని తెచ్చి నన్ను అందులో ఎక్కించాడు. నాపైకొందరు ఆసీనులయ్యారు. శకటము నడుస్తున్నది. నా బ్రతుకెలా నడుస్తుందో తెలియదు.

నన్ను తన కొట్టుకు చేర్చాడు. నాలాంటి బండ ముక్కలు ఆ దుకాణంలో అనేకం గోచరించాయి. నాలాంటి పక్షులున్న గూటికే చేరానని తృప్తి చెందాను. ఉలిచేత బట్టుకుని మరొక వ్యక్తి నన్ను సమీపించాడు. నా శరీరంలో ప్రతి అంగుళాన్ని ఉలితో కొట్టసాగాడు. ఆ సమ్మెట పోటులను భరించలేక పోయాను. ఇలా కొన్ని మాసాలు హింసించాడు. నాకొక రూపాన్ని యిచ్చాడు. బాధలు అందించినా రూపం ఇచ్చినందుకు తృప్తి పడ్డాను. ఆక్షణం నుండి నా పై బేరసారాలు మొదలయ్యాయి. నన్ను సంతగొడ్డును చేశాడు. అందరికీ నన్ను చూపిస్తాడు. నా విలువను నిర్ణయిస్తాడు. వచ్చినవారు నన్ను ఆపాద మస్తకం పరీక్షిస్తారు. నాకు సిగ్గేసేది. నానుండి సప్తస్వరాలు వినాలని అభిప్రాయపడుతారేమో వారి మోటు వ్రేళ్ళతో నా సుకుమార దేహన్ని కొట్టి చూస్తారు. నేను అందంగా లేనని కొందరు వెళ్ళేవారు. అంత ఖరీదు చేయనని మరికొందరు తేలికగా మాట్లాడేవారు. భూదేవి ఒడిలో పవళించియున్న నన్ను వెలికితీసి, హింసించి చివరకు నన్ను బజారులో విక్రయానికి ఉంచాడు. నాలో నేను కుమిలి పోయేదాన్ని. ఈ యమచెఱనుండి తప్పుకొనేది ఎప్పుడా అని చింతించేదాన్ని.

చివరగా ఒక వ్యక్తి వచ్చాడు. నన్ను చూశాడు. వరించాడు. కానీ అతడూ బేరసారాలు చేశాడు. నాకు మనసు చివుక్కుమంది. ఎట్టకేలకు చెప్పిన ధరకే నన్ను కొన్నాడు. యజమాని దూరంగా వెళ్ళాడు. నన్ను వరించిన వ్యక్తిని

నేనడిగాను, "నేనంత విలువ చేయనా? మరి బేరం చేశావు ఎందుకని"?. .... అంతే...."సుందరీ! నీకు విలువ నిర్ణయించాలని కాదు! నాస్థితి నీకు తెలిసి రావాలని" అని అన్నాడు. ఫర్వాలేదు. సంస్కారి చేతిలోనే పడ్డానని తృప్తి చెందాను.

ముందుగా కొంత డబ్బు యిచ్చి నిగనిగలాడేలా నన్ను తయారు చేయమని చెప్పి వెళ్ళాడు. మళ్ళీ యమచెఱ ప్రారంభమైంది. నన్ను పరుండబెట్టి నీటితో తడిపారు. నునుపురాతితో నా శరీరం కందిపోయేలా గోకారు. నా దేహమంతా మంటలెత్తి ఒక రోజంతా ఈ బాధ పడ్డాను. ఆ తరువాత నాపై రంగుల విన్యాసం చేశారు. నన్ను కొన్న వ్యక్తి వచ్చాడు. "బాగుంది" అన్నాడు. సిద్ధం చేయమన్నాడు నన్ను ప్రయాణానికి. ఒక కొయ్యపెట్టెలో నన్ను ఉంచారు. త్రాళ్ళతో నన్ను బంధించారు. గడ్డితో నింపారు. చివరగా నా ముఖంపై కాలు పెట్టి నన్ను లాగి కడుతున్నాడు. పాపం! నన్ను వరించిన యువకుడు కలత చెందాడు. కదిలిపోయాడు. అది అంతేనన్నారు ప్రక్కవాళ్ళు. కట్టడానికి మరో మార్గమే లేదన్నట్లు. ఈ అస్తవ్యస్త ధర్మావలంబనకు తనలో తాను నవ్వుకున్నాడు. నన్ను కట్టి పడేశారు. అతని నేత్రాల నుండి కన్నీరు కట్టలు త్రెంచుకొని పారాయి. గదిలో పడుకొని ఏకాంతంగా విలపించాడు.

మరునాడు ప్రయాణం సిద్ధం చేశాడు. నన్ను వాహనంలోకి ఎక్కించాడు. నా ప్రక్కనే కూర్చున్నాడు. కొంతసేపు పాడేవాడు. మరికొంతసేపు చక్కటి భాషణం చేసేవాడు. ఇలా కదిలించి నన్ను తన యింటికి తీసికొనివచ్చి కొంతకాలం చీకటి గదిలో వుంచాడు. ఒక శుభ ఘడియలో నాకు విడుదలను ప్రసాదించాడు. నా పాదాల చుట్టూ సిమెంటు పోసి పడియున్న నన్ను నిలబెట్టాడు. ప్రాణ ప్రతిష్ఠ చేశాడు. ఆనాటినుండి నీలాంటి వారెందరో నన్నుసేవించి వెడుతున్నారు. మీలో తాను ఒక్కడై నన్ను అర్చిస్తున్నాడు.

ఇది నా కన్నీటిగాథ. అర్థమయిందా! ఎన్ని ఇక్కట్లకు లొంగితే నాకీ ప్రాప్తి లభించిందో అర్థం చేసుకో అని ప్రతిమ అంతర్ముఖమయింది. సత్యకీర్తి మనసు యిప్పుడు బహిర్ముఖమైంది. శిల్పం చెప్పిన సత్యానికి అచ్చెరువొంది, ఆనందాశ్రువులు రాల్చాడు.

# దివ్య దర్శనానుభూతి

కమనీయ ప్రకృతిని గాంచు రమణీయ నయనాలు పరంధాముని దివ్యమంగళ స్వరూపమును దర్శించు శుభ ఘడియ ఎప్పుడు? అట్టి అపూర్వ దివ్య దర్శనానుభూతి ఎందరికి సాధ్యం? ఆచరించాలేగాని అనుభూతి అందకపోదు. ఆచరించాలని భావిస్తే చాలదు. ఆచరణ ప్రక్రియ, సాధన మలుపు తెలిసిరావాలి. తెలిసిన సాధనతో మనస్సు కలిసిపోవాలి. కలిసిన మనస్సు కైవల్యచైతన్యము ననుభవించుచుండ, అలసిన మనుగడ అంతరించి పోవాలి. అంధకార బంధురమైన అజ్ఞాన శృంఖలముల నుండి విడివడి ఆనందధాముని అమృత స్వరూపమును అనుభవించి ఎందరో మహాత్ములు గతంలో తరించారు. వర్తమానంలో తరిస్తున్నారు. భవిష్యత్తులో తరించనున్నారు.

మహాభక్తుల శ్రేణికి చెందిన ధృవుని వంశములో ఆవిర్భవించిన పరమ భాగవతోత్తముడు శ్రీ భరతుడు. తాను రాజ్యభారము వహించుచున్నను శ్రీ కృష్ణ ధ్యాన చిత్తముతో కాలము గడుపుచుండెడివాడు. భగవానుని దశనామ శ్లోకమును నిరంతరము క్షణము ఎడబాయక స్మరించుచుండెడి వాడు. సదా అంతర్యంలో స్మరింపబడుచున్న దశనామ దివ్యమాల నలంకరించుకొని భరతుడు శోభించుచుండెడివాడు. జాగ్రదావస్థలో సాగే జగన్నాథ స్మరణ స్వప్నావస్థలో కూడా ఆగేది కాదు. స్వప్నంలో కూడా భరతుడు నామామృతమును గానము చేయసాగెను. శ్రీ మన్నారాయణమూర్తి స్వప్నంలో దర్శన మివ్వగానే భరతుడు స్వప్నంలోనే సాష్టాంగ దండ ప్రణామములాచరించెడివాడు. సర్వకాల సర్వావస్థలయందు ఈ దశనామ శ్లోకమును భావపూరితంగా స్మరించుచు భగవద్దర్శనానుభూతిని పొంది తరించిన భరతుని చరితము పరమపావనము. వైభవోపేతమైన భరతుని దివ్యనామ స్మరణ ప్రభావ జనిత ప్రశాంత జీవనము విష్ణుపురాణమునందు శోభించుచున్నది. భగవానుని దివ్యదర్శన భాగ్యమును భరతుడు పొందినట్లు శ్రీ శుకుల వారు తెలియజేసి యున్నారు. భరతునికి

అట్టి ఆధ్యాత్మికానుభూతి నొసంగిన శ్లోకమును మనము గ్రహించి, స్మరించి, తరించెదము గాక!

యజ్ఞే శాచ్యుత గోవింద
మాధవానంత కేశవ
కృష్ణ విష్ణో హృషీ కేశ
వాసుదేవ నమోఽస్తుతే ।

ఈ శ్లోకమే భరతుని తరింపచేసిన దివ్య మంత్రము.

ఈ శ్లోక ప్రభావమును చాటుటకాయన్నట్లు ఇటీవల కాలంలో ఒక అద్భుత సంఘటన జరిగింది. మహాభాగవతోత్తములైన శ్రీ నారాయణ భట్టాత్తిరివారు శ్రీమద్భాగవతములోని దివ్యగాథలను తెలియచేయు "నారాయణీయ" మను గ్రంథము రచించడము జరిగినది. ఏ కారణముచేతనో భరతుని, మరియు జడ భరతుని చరిత్రలను లిఖించక వదలిపెట్టెను. ఆ తరువాత కొంతకాలమునకు విడిచిపెట్టబడిన ఆ ఇరువురి మహాత్ముల దివ్య గాథలను ఒక ప్రత్యేక గ్రంథముగా రచించెను. ఆ గ్రంథము పూర్తి కాగానే శ్రీ నారాయణ భట్టాత్తిరి గురువాయూరులో కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీ కృష్ణ దేవుని దర్శించి, అర్చించుటకు వెళ్ళెను. పవిత్రపూజా సమయమున దివ్యాభరణములతో దేదీప్యమానముగ ప్రకాశించుచున్న ఆదిదేవుని గాంచి పరవశించి ఆనందాశ్రువులు రాల్చారు శ్రీ భట్టాత్తిరి. ఆ సమయములో ఆ పరమ భక్తునికి మెరుపులా భరతుని గూర్చి ఒక సంశయ సంకల్పముదయించెను. వెంటనే ఆ భక్తుడు చేతులు జోడించి శ్రీ కృష్ణ పరమాత్మకు నమస్కరిస్తూ "జగన్నాథా! నీ దివ్యనామ ప్రభావముచేత ఆకర్షితుడైన శ్రీ భరతుడు నీ పవిత్ర దశనామ శ్లోకమును అనవరతము పఠించుచు నీ అసమాన అద్భుత రూపదర్శనమును పొందెననియు, స్వప్నములోకూడా మీరు ఆ పరమ భక్తునికి దర్శనమిచ్చుచుండెడి వారనియు పెద్దలు చెప్పగా వింటిని. ప్రభూ! నిజానిజాలు నీకే తెలుసు. అదంతయూ నిజమేనా?" అని ప్రశ్నించగా దీనదయాళుడు,



భక్తవత్సలుడైన ఆదిదేవుని దివ్య మంగళ విగ్రహము తల నూపి, నిజమని భట్టాతిరికి తెలియచేసినట్లు ఆ మహాభక్తుని చరిత్ర ద్వారా తెలియుచున్నది.

దివ్యాత్మ స్వరూపులారా! నామామృత పానమందు అనురక్త్యభిలాష చిత్తముగల ఆత్మబంధువులారా! యజ్ఞేశాది దశనామములతో కూడిన ఈ శ్లోకము శ్రీ భరతునికి దివ్య దర్శనానుభూతిని కల్గించి తరింపచేసెననుటకు ఇంతకుమించి కావలసిన ఆధార మేమున్నది? భక్తజన దాసుడు, బుధజన సేవకుడైన ఈ వ్యాసకర్త జీవితముపై కూడా ఈ శ్లోక ప్రభావ మెంతగానో ఉన్నదని తెలియచేయుటకు సంతసించుచున్నాను. అనుభవపూరితముగ నా జీవితములో కూడా తన వైభవమును ప్రకటించిన ఈ అపూర్వ శ్లోకమును అక్షర లక్షలు పారాయణ చేసి, అనుభూతి పొంది భక్తులు తరించెదరనెడి సత్సంకల్పముతో గీతా జ్ఞాన యజ్ఞ ముగింపు సమయాన యజ్ఞ ప్రసాదముగ ఈ చిన్ని పొత్తమును అందించుచున్నాము. ఈ శ్లోకమును భావయుక్తముగ పఠించి, స్మరించినచో తప్పక తరించగలరని, కారాగృహములో శ్రీ కృష్ణ దేవుడుదయించునట్లు ఐహిక వాసనా పూరిత హృదయ బంధిఖానాలో శ్రీ కృష్ణదేవు డనెడి చైతన్యజ్యోతి ఆవిర్భవించ గలదని తెలియచేయుచు శ్లోకమును, శ్లోకార్థమును మీ ముందుంచుచున్నాను.

యజ్ఞే శాచ్యుత గోవింద
మాధవానంత కేశవ
కృష్ణ విష్ణో హృషీకేశ
వాసుదేవ నమోఽస్తుతే ॥

"యజ్ఞేశ, అచ్యుత, గోవింద, మాధవ, అనంత, కేశవ, కృష్ణ, విష్ణు, హృషీకేశ, వాసుదేవ– నీకు వందనములు అనునది శ్లోకార్థము.

ఈ శ్లోకమునందు భగవానుని దశనామములు మహోజ్జ్వలమై అలరారుచున్నవి. ఈ నామములన్నియు విష్ణు సహస్ర నామస్తోత్రము నందు ఆణిముత్యముల వలె శోభించు చున్నవి.

1) యజ్ఞేశ :– "యజ్ఞోవై విష్ణుః" అను శృతి వాక్యము ననుసరించి యజ్ఞేశ అనగా సర్వభూత హితమును కోరి, ఈశ్వరార్పణ బుద్ధితో చేయబడు సత్కర్మల రూపమున నుండు వాడునై యున్నాడు. సకల యజ్ఞములు భగవానుని స్వరూపములే గాన తాను "యజ్ఞేశ" అని పిలువబడుచున్నాడు. ఈ మొదటి దివ్య నామమైన "యజ్ఞేశ" అను పదము నుచ్చరించగానే సాధకుని జీవితములో త్యాగజీవన విధానము తొంగి చూడవలెను. ఇదియే ఈ మొదటి నామ మహిమ.

2) అచ్యుత :– నశించనివాడు అచ్యుతుడు. అతడే పరమాత్మ త్రికాలము లందుండి కాలాతీతమై మనగలవాడు. "తస్యాహం న ప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత 6వ అధ్యాయంలో తెలియజేసియున్నారు. "నత్వజేయం కథంచన" అని రామాయణ ప్రవచనము. కనుక అప్రమేయుడై వెలుంగు శ్రీ హరిని దర్శించవలయు ననిన దేహేంద్రియ మనో బుద్ధులకు అధిష్ఠానమై భాసిల్లు అచ్యుత స్వరూపమును సాధకుడు సదా మననము చేయుచుండవలెను. ద్వితీయనామమైన అచ్యుత నామము నుచ్చరించగానే ఆత్మ ధ్యానము అంతఃకరణలో తొంగి చూడవలెను.

3) గోవింద :– గోవులను రక్షించువాడు గోవిందుడు. అనగా మానవునిలోని పశు ప్రవృత్తులను అదుపుచేసి, సదుపదేశము ద్వారా సన్మార్గమున నడిపించువాడు గోవిందుడు. ఈ మూడవ నామమైన గోవింద శబ్దము ఉచ్చరించబడగానే సాధకుడు తనలోని పశు ప్రవృత్తులను నశింప చేసుకొనవలెను. శాస్త్రాధ్యయనము సాగించవలెను. వాక్శుద్ధి కల్గియుండవలెను.

4) మాధవ :– 'మా' అనగా లక్ష్మీదేవి. 'ధవ' యనగా స్వామియని భావము. మాధవ యనగా లక్ష్మీనాథుడు. కనుక మాధవుడు ఐశ్వర్య ప్రదాతయై యుండుటచే "మాధవ" అను శబ్దము నుచ్చరించగానే 'సాధకునిలో దైవీసంపద' తొంగి చూడవలెను. 'మౌనాద్ ధ్యానాచ్చ యోగాచ్చ విద్ధిభారత మాధవమ్' మౌన ధ్యాన యోగాదుల వలన గ్రహించుటకు శక్యమైనవాడు మాధవుడని శ్రీ వ్యాసభగవానుల నిర్వచనము. శక్తివంతమైన ఐశ్వర్య ప్రదాయిని లక్ష్మీదేవితో కూడిన భగవానుని దివ్యనామము మాధవ నామము. అందుచే సర్వశక్తి సమన్వితమై యున్నది.



"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్"
అని రామాయణము కూడా ప్రశంసించి యున్నది.

5) అనంత :– సకల ప్రపంచము తానై యుండి "అత్యత్తిష్ఠ ద్దశాంగుళమ్" అంతకు మించి యున్నాడని వేదము నిర్వచించుటచే శ్రీ హరి అనంతుడని తెలియబడుచున్నాడు. అంతంలేని ఉపాధులను ధరించి యుండుటచే కూడా తాను అనంతుడని తెలియబడు చున్నాడు. ఈ ఐదవ నామమైన "అనంత" శబ్దము నుచ్చరించగానే జీవుడు తన యొక్క అనంతత్త్వమును గుర్తించి, గ్రహించి తదనుగుణముగ జీవించ గలిగి యుండాలి. అన్ని ఉపాధులు భగవానునివే యని అనుభవమునకు తెచ్చుకొని సర్వులలో నారాయణుని దర్శించుటకు ప్రయత్నించాలి.

6) కేశవ :– క+ అ+ ఈశ. ఇవి కలిపి కేశ శబ్ద మయినది. "క" అనగా బ్రహ్మ. "అ" అనగా విష్ణువు. "ఈశ" అనగా ఈశ్వరుడు. ఈ త్రిమూర్తులకు ఆధారమైన వాసుదేవ చైతన్యమే కేశవుడు. "కేశవ" శబ్దములోని "వ" ప్రత్యయము ప్రశస్తమైనది. విష్ణు సహస్రనామ స్తోత్రమునందు వకారాదులు గల నామములు 120 కలవు. కనుక ఆరవదియైన ఈ కేశవ నామోచ్చారణ జరుగగానే అధిష్ఠాన పరబ్రహ్మ అనుభవమునకు అందవలెను. జాగ్రత్స్వప్న సుషుప్తుల కాధారమై వెలుంగు తురీయమే తాననెడి అనుభూతి అభివ్యక్తము కావలెను. విష్ణు పురాణము ప్రకారము దుష్టాత్ముడగు "కేశి" యను రాక్షసుని వధించుట చేత కేశవ అను నామము శ్రీ హరికి కల్గినది. "కేశి" యను రాక్షసుడు అజ్ఞానమునకు ప్రతీకమై యున్నందున ఈ కేశవ నామోచ్చారణ చేయు భక్తునికి అజ్ఞానము నశింప చేయవలె ననెడి వజ్రసంకల్ప ముదయించవలెను.

7) కృష్ణ :– నీలమేఘమువంటి శరీరచ్ఛాయతో శోభించువాడు శ్రీకృష్ణుడు. భక్తుల హృదయములను ప్రేమతో ఆకర్షించుకొను వాడని కూడా భావము. ఏడవదియైన ఈ కృష్ణనామము నుచ్చరించు భక్తుడు సదా ఆనంద స్వరూపము నందు ఓలలాడువాడై యుండవలెను. స్వార్థమును వీడి, ప్రేమ జీవనము చేయగలిగినవాడై యుండవలెను.

8) విష్ణు :– సర్వత్ర వ్యాపించి యున్నవాడు విష్ణువు. "భూ నభోన్త రాళములు నాచే ఆక్రమింపబడుటచేత నేను విష్ణువని చెప్పబడితిని" అని

మహాభారత శాంతిపర్వము నందు తెలియ చేయబడినది. ఎనిమిదవ నామమైన ఈ విష్ణుః అను శబ్దము నుచ్ఛరించగానే దేశకాలాదులకు అతీతమై మనగలుగు నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వరూపమును సాధకుడు అనుభవమునకు తెచ్చు కొనవలెను.

9) హృషీకేశః:– హృషీకేశ యనగా సర్వేంద్రియములకు అధిపతి యైనవాడు అని భావన. ఇంద్రజిత్తును సంహరించడానికి ఇంద్రియ జిత్తుయైన లక్ష్మణుడే కావలసి వచ్చెను. తొమ్మిదవ నామమైన ఈ హృషీకేశ శబ్దము నుచ్ఛరించగానే సాధకునిలో బహిర్ముఖమగు ఇంద్రియములను అంతర్ముఖము చేసుకొనవలె ననెడి భావము కలుగవలెను.

10) వాసుదేవ:– విశ్వమంతయు నిండియుండి సర్వములో క్రీడించువాడు వాసుదేవుడు అని తెలియదగును. "వాసవత్సర్వ భూతానాం" అని మహాభారతము నిర్వచనము చేసింది. "సర్వత్రా సౌ సమస్తంచ" అని విష్ణు పురాణము నిర్వచించినది. కనుక ఈ దశనామ శ్లోకములో చివరిదైన ఈవాసుదేవ శబ్దము నుచ్ఛరించు భక్తుడు తనలో సమస్తమును, సమస్తములో తనను దర్శించ గలవాడై యుండాలి. సమ దర్శన వీక్షణమే ఈ చివరి వాసుదేవ నామము మనకందించు మహోత్తర సందేశము.

త్యాగభావమును సూచించు "యజ్ఞేశ" యనెడి నామముతో కదలిన ఈ పవిత్ర దశనామ శ్లోకము "వాసుదేవ" యనెడి సమదర్శన కళ్యాణానుభూతిలో ముగియుచున్నది. ఈ దశనామములను వరుసగ ఉచ్ఛరించి చివరగా మహా భక్తుడు, పరమ భాగవతోత్తముడైన శ్రీ భరతుడు "నమోస్తుతే" అని శ్లోకము ముగించినాడు. భగవాన్! నీకు నా నమస్కారము అని తన శరణాగత భావ ఔన్నత్యమును, భక్తి తత్పరతను చివరగా తెలియచేయుచున్నాడు. శరణాగత భావముతో కూడిన భక్తియే ముక్తికి సూటియైన దారియనెడి సందేశము నందించుచున్నాడు.

భక్తులారా! శ్రద్ధాభక్తి సమన్వితులై భగవద్దర్శనానుభూతికి సోపానమైన ఈ దశనామ శ్లోకమును పఠించి, స్మరించి, తరించండి.

– ఓం శ్రీ కృష్ణార్పణమస్తు. –

## బాధలుభరించు – భగవానునితో జీవించు

మానవ శరీరం మూడు ఘడియలు అగుపించి మృత్యు ముఖంలో ప్రవేశించే మృణ్మయ భాండము. జీవితమొక నీటి బుడగవంటిది. గాలి పడగ లాంటిది. జీవన చక్రము నిరంతరము నిర్దిష్టమైన తన గాడిలో పరిభ్రమిస్తూనే ఉంటుంది. కాలగతిలో ఈ జీవన శకటం వైకల్యం కాకతప్పదు. ఈ సత్యాన్ని సదా మననం చేసుకొంటూ జీవన యాత్రను సాగించాలి. మరణం తథ్యమని, అవసాన దశలో మంచాన పడటము తప్పదని, ఇతరుల దయాభిక్షతో వార్ధక్యాన్ని నెట్టవలసి వస్తుందని, దుర్భర జీవితానికి మృత్యువు చరమగీతిని పాడుతుందని అనుక్షణము జ్ఞాపకము చేసుకొంటూ వైరాగ్యమును పెంపొందించుకోవాలి.

"దుర్లభం హి సదా సుఖమ్"

నిత్యానందము ఈ ప్రపంచములో లభ్యమయ్యేదికాదని శ్రీ మద్రామాయణము అయోధ్యకాండయందు తెలుపబడియున్నది. జీవితం బాధల మయమైనదని బాధపడకు. నిన్ను బాగుచేసేందుకే బాధలొస్తాయి. కాలంలో బాధ కదిలింది. కాలంలో కదిలిన బాధ కాలంలోనే కనుమరుగవుతుంది.

"శోకశ్చ కిల కాలేన గచ్ఛతా హ్యపగచ్ఛతి"

కాలం కదులుతుంటే కాలజనిత శోకము కూడా కనుమరుగవుతుందని శ్రీ మద్రామాయణము యుద్ధకాండ యుందున్నది.

కోరికలే దుఃఖానికి ప్రబలకారణములై యున్నవి. పడగవిప్పి నిలబడి కాటువేయడానికి సిద్ధంగా యున్న కోడెత్రాచులవలె కోరికలు భయంకరమై యున్నవి. బుసలుకొడుతూ కాటువేసి అవి కనుమరుగవుతాయి. విషం మాత్రము నిలువెల్లా నిలచిపోతుంది. కోరికకు కాటు వేయడమే తెలుసు. ఫలితం ఏమిటి? శరీరం సడలిపోతుంది. మనస్సు సంవేదన చెందుతుంది. పురోగమించవలసిన జీవనగతి మారుతుంది. మలుపు తిరుగుతుంది. మృత్యువుకు ఆహుతవుతుంది.

బాధలను చూసి భయపడకు. వాటిని నిర్మూలించాలనే ప్రయత్నములో నిన్ను నీవు పోగొట్టుకోకు. బాధలనే మంచు నిన్ను క్రమ్మనీ. భక్తియనెడి సూర్యరశ్మిలో నిలబడటము నేర్చుకో. కష్టాలు కరిగిపోతాయి; కష్టాలు, కన్నీళ్ళు అనేవి నీ జీవన శకటానికి రెండు సురక్షిత చక్రములై యున్నాయని మరచిపోకు. జ్ఞానదృష్టిని కోల్పోయిన మానవాళిని జాగృతం చేసి ఆత్మదర్శనం చేయించగల జ్ఞానదీపికలు బాధలే. సాధకుడు సదా కన్నీళ్ళని ఆహ్వానించాలి. ఆ కన్నీటితో భగవానుని చరణకమలములను అభిషేకించే అవకాశమును ఆశిస్తూ జీవించాలి. కన్నీటి బ్రతుకులే కమలనాభుని కొరకు పరితపిస్తాయి.

అతిస్నేహ పరిష్వంగాత్
వర్తిరార్ద్రాపి దహ్యతే

"ఎక్కువగా తైలము కలియుటచేత తడిసిన వత్తి కూడా వెలుగుతుంది" అని శ్రీమద్రామాయణము కిష్కింధకాండ యందు తెలుపబడి యున్నది.

సాధకా! సాగిపో! నీ జీవన నౌకకు భగవానుడే చుక్కాని. అతడే మార్గగామి కూడా. మెల్లగా కదలిపో. మార్గంలో మనిషి ఎదురౌతాడు. అతడిని ప్రేమించు. కానీ విశ్వసించకు. మనిషికి మనస్సుంది. మారేదే మనస్సు. మారే మనస్సులను కలిగిన మనిషిని ప్రేమించాలే గాని విశ్వసించకూడదు.

చలా హి ప్రాణినాం మతిః

"మానవుని మనస్సు చంచలమైనది" అని శ్రీమద్రామాయణము అయోధ్యకాండలో తెలుప బడినది. నా జీవితంలో తెలియబడిందికూడా.

ప్రేమమయుడైన పరమాత్మనే విశ్వసించు. అతడికై జీవించు. అతడికై మరణించు. ఇదియే సత్య జీవనము.

విశ్వమందిరములో ప్రతి ప్రాణిలో భగవానుని దర్శించి అర్చించే పూజారివి నీవు కావాలి. సమస్తములో భగవంతుని వైభవమును వీక్షించే సమదర్శన యోగివి కావాలి. నీవు తరించాలి. ఇతరులను తరింప చేయాలి. ఇదియే సనాతన ధర్మమందించు ఉన్నతాశయము. ఉజ్జ్వల జీవనము.

ప్రయత్నించు.

విజయలక్ష్మి నిన్ను వరించేందుకు సిద్ధంగా వుంది.

# ఉన్మదొక్కటే

పరిణామశీలమై, కల్పిత మనుగడ గల మిథ్యాప్రపంచము సత్యదూరమైనదనియు, చూచేవాని మనస్సుకన్నా అన్యమైనది గాదనియు సంపూర్ణముగా గ్రహించిన సాధకుడు అట్టి ప్రపంచమును చిత్రించిన మనస్సును నిగ్రహించి, దానిని నిరోధించు ప్రయత్నమును సాగించుటలో దైవశక్తి యనెడి వృక్షమునకు రెండు శాఖలైయున్నట్టి క్రియాయుత ప్రాణము, సంకల్పయుత మనస్సులను ఆకళింపు జేసుకొన్నవాడై, వాటి పరస్పరాధీనమును దృష్టియందిడుకొని, మనో నిగ్రహమునకు వాయురోధనమును చేపట్టి, వల పక్షిని చిక్కించుకొను విధముగా మనస్సును చేజిక్కించుకొనినవాడై, తనకు చేజిక్కిన మనస్సు లయించుట వలన కలిగే తాత్కాలిక ఉపశమనముతో తృప్తి లభించదనియు, నిజమైన సంతృప్తి మనోనాశము ద్వారానే లభించగలదనియు మనోనాశము జరిగిన యోగి ఆచరించదగిన కర్మమంటూ ఈ జగత్తునందు ఉండదనియు సత్యమును ఎఱిగినవాడై, అనేక సాధనల నాచరించుటకు సిద్ధపడి, పూజ, జప, ధ్యానాదుల నాచరించి కాయముద్వారా ఆచరించబడు పూజకన్నను వాక్కుద్వారా జరుగు వాచక జపము శ్రేష్టమనియు, వాచక జపము కన్నా మౌన జపము శ్రేష్ఠమనియు మౌనజపముకన్నా మనస్సు ద్వారా ఆచరించు ధ్యానము శ్రేష్ఠమనియు తెలిసి అట్టి ధ్యానము విఘ్నములతో కూడిన విరళ ధ్యానము కాకుండా నదీప్రవాహమువలెను, ఆజ్యధారవలెను సాగెడి సరళ ధ్యానమై యుండవలెననియు, అట్టి ధ్యానమే మనస్సును హృదయ స్థానము వైపునకు నడిపించి స్వస్థతను కలిగించుననియు, అట్టి స్వస్థతను హృదయమునందు మనస్సునకు కల్పించుటయే కర్మ, భక్తి, యోగ, జ్ఞానముల ముఖ్యాశయమనియు సంపూర్ణముగా తెలిసినవాడై, తత్కార్యసాధనలో బహిర్ముఖమయ్యే మనస్సును దృశ్యప్రపంచము నుండి వెనుకకు మరలించి, సంకల్పముల నుడిగింపజేసి, మనస్సును మనస్సు ద్వారా అన్వేషించు యత్నములో అసలు మనసే లేదని

తెలిసి కొనినవాడై, ఇలా మనస్సు లేదనెడి విషయమును ప్రస్తావించినది కూడా సంకల్పమే ననెడి సత్యమును సూక్ష్మముగా గ్రహించి అలా తెలియవచ్చు మాత్ర సంకల్పము "అహం" భావన అనియు, దాని ద్వారా లేవనితెలిసిన సంకల్పములన్నియు 'ఇదం" భావన అనియు స్పష్టముగా దర్శించి, 'అహం" భావనయే సర్వమునైన "ఇదం" భావనలకు ఆధారమై యున్నదనియు, అట్టి అహం భావన కూడా ఎక్కడ నుండి పుట్టుచున్నదో గ్రహించుటకు యత్నించుట వలన "అహం" భావనను కూడా అంతమొందించి, అభేద జ్ఞానస్వరూపమును అనుభవించుచు, జ్ఞానమే పూర్ణమై, అద్వయమై, సత్తా స్వరూపమై, దేహము, ఇంద్రియములు, ప్రాణము, బుద్ధి, అజ్ఞానములను అధిగమించి, సత్స్వరూపమై భాసించు ఆత్మయనియు, అట్టి సత్తును ప్రత్యేకించి గ్రహించేందుకు చిత్తు సత్తు కన్నా వేరుగా లేదనెడి సత్యమును తెలిసినవాడై, మాయోపాధిచే చరించు ఈశ్వరుడును, అవిద్యోపాధిచే చరించు జీవుడును యదార్థానికి వేరుకాదనియు, వారి మధ్య తెలియవచ్చు అంతరము కల్పితమేననియు, తొడుగువీడి హృదయ మడుగులో మునక వేయగనే ఇరువురును ఏకరూపులై, స్వాత్మరూపులై ప్రకాశించగలరనెడి సత్యమును చక్కగా గ్రహించి, అద్వితీయమైన ఆత్మను తెలుసుకొనేందుకు ద్వైత సాధనలేవీ ఉపకరించ నందున ఆత్మగా ఉండి పోవుటయే ఆత్మను గ్రహించుట కాగలదనియు, అట్టి దివ్యానందస్థితిలో జ్ఞానాజ్ఞానములు ఏకమై, ఆద్యంతములు తెలియని, బంధముక్తులు అర్థంగాని, అనిర్వచనీయ సత్తాస్వరూపము వెలుగులకు వెలుగుయై భాసించుట నెరిగి, అట్టి అద్వైత ప్రకాశము తన స్వప్రకాశమేననియు, స్వస్వరూపస్థితియే ననియు ఎఱుకగలిగి, మరుపు వదిలి జ్ఞాన వలపులో మలుపు తిరిగి మైమరిచి ఉండుటయే సత్యమనియు, అది ఒక్కటేననియు, ఉన్నదొక్కటేననియు, ఆ ఒక్కటి తానేననియు తెలియుటయే సర్వశాస్త్ర సారమైన ఆదేశమనియు, ఉపదేశమనియు శ్రీ రమణ భగవానుని అభిప్రాయము.

* * *

# సనాతన ధర్మ వైభవము

దుర్లభమైన మానవ జన్మము ఎంతో ప్రశస్తమైనది. ఇది అనంతము నుండి అనంతమునకు పరుగులిడే అమృత రసవాహిని. జీవితమును అనుభవించు వాడు జీవుడు. అతడు జీవించి అనుభవములను పొందేందుకు ఉపకరించునది దేహము. దేహమును కలిగియున్నందున తాను దేహి అనబడినాడు. దేహము దేహముగా కొనసాగుట, సాగలేని దశలో ఆగి శ్మశానంలో బూదిగా మారుట యనునది దేహము యొక్క ధర్మము. దేహధర్మము వేరు, దేహి ధర్మము వేరు. ఈ రెండింటి కలయికలో జీవి ధర్మము వేరు. ఏదయిననూ అది అలా కొనసాగుట యనునది దేనిపై ఆధారపడి యున్నదో, ఏది లోపించుటచేత ఆ వస్తువు నశించి పోవునో అది దానియొక్క ధర్మము అని నిర్ణయించవలసి యున్నది. నిప్పు వేడిగా ఉంటుంది. ఉండాలి. ఉండక తప్పదు. వేడిలేని నిప్పును నిప్పు అని అనరు. కనుక వేడి యనునది నిప్పుయొక్క ధర్మము. ఈ విధముగా ఆలోచించినచో మనకు కొన్ని విషయాలు స్పష్టమవుతాయి.

మనము చేయు ప్రతి పనికి ధర్మమున్నది. అనుభవమునకు ధర్మమున్నది. ప్రతి రంగములోనూ ధర్మము ఉన్నది. అయితే ఈ ధర్మ నిర్వచనము, నిర్వహణము ఈ జీవితానికే సంబంధించినదా? కాదా? అనే శంక రావచ్చును. ధర్మము చాలా విశాలమైనది. అది ఒక జీవితానికి సంబంధించినది కాదు. ఈ జీవితము రాకమునుపే ధర్మము నీతో ముడిపడి యున్నది. ఈ జీవితము సమాప్తమైనను ధర్మముడి వీడకనే ఉంటుంది. ధర్మము మానవునిలో పూర్ణత్వమును దించుతుంది. ధర్మము మనలను పతనము కానివ్వదు. ప్రగతిని అందిస్తుంది.

విస్తృతమైన ఈ ధర్మము శాశ్వతమైనది. శాశ్వతము అంటే సనాతనము అని అర్థము. అందుచేతనే అమర సందేశము నందించు వైదిక ధర్మమును "

సనాతన ధర్మము" అని పిలువవలసి వచ్చినది. అన్యమతము లన్నియు లౌకిక ధర్మమార్గాన నిలబడి దేశకాల పరిస్థితులను దృష్టియం దిడుకొని ధర్మమును ప్రవచించాయి. అందుచేతనే అవి అసంపూర్ణముగా మిగిలిపోయాయి. శాశ్వత ధర్మజీవనమును ఒక్క సనాతన ధర్మమే (హిందూధర్మమే) అందించగల్గినది. సనాతన ధర్మము అనెడి ఈ విశిష్టపదము యొక్క భావమును గ్రహింతుము.

"సనాతనస్య ధర్మః సనాతనధర్మః" 1

శాశ్వతముగా ఉండు ధర్మము గనుక ఇది సనాతన ధర్మము ఆయెను అని ఒక అర్థము.

ఇతర మతములకు సనాతన ధర్మమునకు ఇదియే తేడా. కొన్ని మతములు గతములో ఉండినవి. కానీ ప్రస్తుతము లేవు. మరికొన్ని మతములు గతములో లేనివియై ప్రస్తుతము గోచరించుచున్నవి. కాల పరిధిలో నిలిచిన మతాలు కాలాతీతమైన సత్యమును, త్రికాలముల యందు వ్యక్తము కావలసిన ధర్మమును ప్రవచించగలవా? అందుచేత ఆ మతము లన్నియు అపరిపూర్ణములు అని పిలువబడినవి. కానీ సనాతన ధర్మము అలాంటిది కాదు. ఈ మతము లన్నియు ఆవిర్భవించక పూర్వము ఉండినది; అభివృద్ధి చెందే విజ్ఞాన శాస్త్ర పరిశోధనలకు సమాధానం చెప్పలేక అన్యమతములు అదృశ్యమైనపుడు కూడా, "నేను విజ్ఞానశాస్త్రము అందుకోలేని ఎత్తున నిలబడియే ఉన్నాను" అంటుంది ఋషిప్రోక్తమైన సనాతన ధర్మము.

సదా భవః సనాతనః

సనాతనం కరోతి సనాతన యతి

సనాతన యో తీతి సనాతనః

సనాతన శ్చాసౌ ధర్మశ్చ సనాతన ధర్మః 2

సనాతన ధర్మము శాశ్వతమైనది. దీనిని అందించిన భగవానుడు శాశ్వతుడు. అంతేకాదు. దీనిని ఎవరైతే విశ్వసించి ఆచరింతురో వారు కూడా సనాతనులే



అగుదురు. తనలో ప్రవేశించిన ప్రతి వస్తువును అగ్ని బూడిదగా మార్చునట్లు తన నాశ్రయించిన పర్వులను సనాతన ధర్మము సనాతన రూపులుగా మార్చుతుంది.

సనాతనశ్చాసౌ ధర్మశ్చ

సనాతన ధర్మః 3

ఆది మధ్యాంతముల యందు చెక్కు చెదరక నిలిచి యుండి సనాతన ధర్మము అని శ్లాఘించబడినది. సృష్టికి పూర్వము ఈ ధర్మము నిలిచి యుండినది. సృష్టికి కారణమైనది. సృష్టి నడుచు కాలమునందును ఉన్నది. సృష్టి లయించినపుడు ఉంటుంది. ఆ తరువాత కూడా ఉంటూ బీజరూపమున ఉన్న జగత్తు వ్యక్తమగుటకు కారణమవుతుంది. ఈ విధముగా మానవాభ్యున్నతిని సర్వకాలముల యందు సుస్థిరముగా నుంచునది సనాతన ధర్మము.

సనాతన యతీతి సనాతనః

సనాతన స్వరూపం ప్రాపయతి 4

శాశ్వతమైన ఈ సనాతన ధర్మమును అనుష్ఠించువారలు శాశ్వతుడైన పరమాత్మను పొందగలరు. సనాతనుడైన పరమాత్మను అందించ గలుగుటచేత ఈ హైందవ ధర్మము సనాతన ధర్మము అని కీర్తించబడినది.

జీవితమునకు అవసరమైన వ్యవహారిక ధర్మములను బోధించుటయే గాక జీవి తరించుటకు ఉపకరించు మోక్ష ధర్మమును కూడా అందించుటచేత సర్వమానవులకు ఉపయుక్తమైనది సనాతన ధర్మ మొక్కటియే.

❋